C




# గురజాడ

1471

ఏ. ఆర్. నార్ల



భారతీయ
సాహిత్య
నిర్మాతలు

రాశిలో తక్కువేగానీ, గురజాడ వేంకట అప్పారాయ కవి (1862-1915) ప్రభావం విస్తృతం. తెలుగు సాహిత్యం లోని మూడు ప్రక్రియల్లో - కవిత్వంలో, నాటకంలో, కథానికలో - ఆయన ఒక పథ నిర్దేశకుడు. తన జీవితకాలంలోని అత్యధిక భాగం రాజ ప్రసాదాల్లో ప్రభువులతో గడుపుతూ, సామాన్యుడు సొంత వ్యక్తిత్వం పొందగలిగే భవిష్యత్సమాజాన్ని గురించి కలలు గన్నారు. నిజానికి, రంగు భేదాలూ, మత భేదాలూ, వర్ణభేదాలూ, కులభేదాలూ లేకుండా, మానవ స్వేచ్ఛ, మానవ సమానత్వం, మానవుల ఆత్మగౌరవం మీద ఆధారపడ్డ భవిష్యత్ ప్రపంచాన్ని ఆయన దర్శించారు. ఒక కొత్త మానవత కోసం పోరాడిన మహాయోధుడు ఆయన.

యీ గ్రంథ రచయిత వి. ఆర్. నార్ల భారతీయ సాహిత్య నిర్మాతల అనుక్రమం పాఠకులకు కొత్తకాదు— ఆయన యీ అనుక్రమంలో వీరేశలింగంపై, వేమనపై గ్రంథాలు రచించారు కాబట్టి. నార్ల ప్రఖ్యాత పాత్రికేయులు. తెలుగులో, ఆంగ్లంలో యెన్నో పుస్తకాలు రాసిన రచయిత. రాజ్యసభ మాజీ సభ్యులు. రెండు విశ్వవిద్యాలయాల నుంచీ గౌరవ డి. లిట్ పట్టాను పొందారు.

ముఖ పత్ర రచన : సత్యజిత్ రాయ్

ముఖరేఖా చిత్రం : అబ్బూరి గోపాలకృష్ణ
(యూనిలిట్ సౌజన్యంతో)

వెల : రూ. 4.

CI

భారతీయ సాహిత్య నిర్మాతలు

# గురజాడ

మూలం :

వి. ఆర్. నార్ల

అనువాదం :

కేతు విశ్వనాథ రెడ్డి



సాహిత్య అకాడెమి

న్యూ ఢిల్లీ

GURAZADA—Telugu translation by Sri KETHU VISWANATHA REDDY of V. R. NARLA'S English Monograph of the same name. Sahitya Akademi, New Delhi, 1983. *Price*: Rs. 4-00.



First Edition : 1983

*Copies available at :*

SAHITYA AKADEMI

Rabindra Bhavan, New Delhi-110 001.

*Regional offices :*

29, Eldams Road, Madras-600 018.

Block VB. Rabindra Sarobar Stadium, Calcutta-700 029;

172, Mumbai Marathi Grantha Sangrahalaya Marg,

Dadar, Bombay-400 014.

Published by Sahitya Akademi and Printed at

WELDUN PRESS, 68, Mannappa Mudali Street, Madras - 600 021.

4

# కృతజ్ఞత

— ౧ —

గురజాడ డైరీలనూ, నోటు పుస్తకాలనూ యిచ్చిన విశాలాంధ్ర ప్రచురణాలయం (విజయవాడ) వారికి

మొదటి నాలుగు అధ్యాయాల టైపుప్రతిని చదివి, కొన్ని విలువైన సూచనలను అందజేసిన సి.యన్.ఆర్. శాస్త్రి (బొంబాయి) గారికి

రాతప్రతి ప్రెస్ కాపీ సిద్ధం చేయడంలో తోడ్పడిన వుస్మానియా విశ్వవిద్యాలయం (హైద్రబాదు) ఆంగ్ల భాషాచార్యులు డా॥ ఐజాక్ సెక్వీరా గారికి

గురజాడ పద్యాలకూ, గేయాలకూ తాముచేసిన ఆంగ్లానువాదాలను వుల్లేఖించు కోడానికి అనుమతి నిచ్చిన శ్రీశ్రీ, ఆచంట జానకిరామ్ గార్లకూ, తాముచేసిన నాలుగు వాక్యాల అనువాదాన్ని వుల్లేఖించు కోడానికి అనుమతినిచ్చిన ఆర్. అప్పలస్వామి గారికి

నా గ్రంథ పరిసమాప్తికోసం వుదారమైన ఓర్పువహించి నిరీక్షించిన సాహిత్య అకాదెమీ (నూఢిల్లీ) కార్యదర్శులకూ

ప్రూఫులు చూసిన ప్రముఖ పాత్రికేయులూ, గ్రంధకర్తా అయిన డి. ఆంజనేయులు గారికి

గురజాడ రేఖా చిత్ర ప్రతిని వాడుకోడానికి అనుమతి నిచ్చిన అబ్బూరి గోపాలకృష్ణ గారికి

నా రాత ప్రతిని టైపుచేసి, మళ్ళీ మళ్ళీ టైపుచేసి, యితరత్రా చాలా విధాల తోడ్పడిన శ్రీ జి. యం. రాములుకూ

నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

# అధ్యాయ క్రమం

—: o :—

# 1. జీవన ద్వారం

"మృత్యువు జీవన ద్వారం"

—పి. జె. బెయిలీ

1915 నవంబరు 30వ తేదీ; రవి వుదయాకాశాన్ని అధిరోహిస్తోంటే, ఒక కవి విజయనగరం లోని తమ యింట్లో అస్తమిస్తున్నాడు. గాలిలో శైత్యం - శీతాకాలపు తొలినాళ్ళ శైతల్యమూ, మీద పడబోతున్న మృత్యు శైతల్యమూ.

తన పరిస్థితి యెంత తీవ్రంగా వుండేదీ, గ్రాహ్యశక్తులు యెప్పటిలాగే అప్పుడూ నిశితంగావున్న కవికి తెలుసు. ఆ మధ్యచేసిన తీవ్రమైన సుస్తీ నుంచీ ఆయన యింకా సరిగా కోలుకోనేలేదు. యిప్పుడిది ముంచుకొచ్చి పడింది. యేప్రిల్ నెలలో జీవన్మరణాల మధ్య వూగిసలాడుతూ. తన 'హంస గీత'మని వుద్దేశించిన దాన్ని ఆయన రచించారు. దానికి సార్థకమైన పేరు పెట్టారు—'లంగరెత్తుము' అని. తన డాక్టర్ల గట్టి వైద్యమూ, యింట్లోవాళ్ల కంటి పాపలా చూసుకొంటూ చేసిన సపర్యలూ, లేకపోయి వుండినట్లయితే, అప్పుడే ఆయన లంగరెత్తి వుండేవారు; తెలియని తీరాల్లోకి పయనించివుండే వారు. యిప్పుడు పుంజుకొనే జవసత్త్వాలు వుడిగిపొయ్యాయి. యెవరూ అయ నను రక్షించలేరు. యిక ఆయన అలసించడానికిలేదు. అయినా నిర్వర్తింప వలసిన బాధ్యతలున్నందువల్ల మరి కొంతకాలం జీవించాలని ఆశపడ్డారు.

బాధ్యత లెంత కష్టతరమయినప్పటికీ, వాటిని నెరవేర్చడంలో ఆయన అంతే చిత్తశుద్ధితో వ్యవహరించేవారు. ప్రవృత్తిలోని యీ లక్షణమే యిప్పటి ప్రమాదకరమైన పరిస్థితికి దోహదమయింది. 1897 లో అర్ధా యుష్కుడుగా మరణించిన తమ ప్రభువూ, పోషకుడూ, అయిన విజయనగర మహారాజా ఆనంద గజపతి కిచ్చిన మాటను నిలబెట్టుకోడానికి కోర్టు తగా దాల్లో పదిహేనేళ్లు ఆయన గడపవలసివచ్చింది. పుడుతూనే బీకబీకగాపుట్టి, యెప్పుడూ అనారోగ్యానికి గురి అవుతున్న ఆయనను యిన్నేళ్ళ బరువు బాధ్య తలూ మరింత కృంగదీశాయి. బిడ్డలులేని ఆనంద గజపతి దత్తపుత్రుడు

విజయ రామరాజుకు వ్యతిరేకంగా జిల్లాకోర్టు తీర్పు వచ్చిన సందర్భంలో సయితం ఆయన చలించలేదు. ఆయనకున్నంత చిత్తశుద్ధీ, విధేయతా, లేని వాడెవడైనా కంగుతిని వుండేవాడు. హైకోర్టు తీర్పు అనుకూలంగా వచ్చే అవ కాశాలు అంతగా లేవని తెలిసిపోతూనే, వివేకంతో ఆయన రాజీచేయించారు. దాంతో వారసత్వం చెక్కుచెదరలేదు.

కీర్తిశేషులయిన మహారాజావారి కిచ్చిన మాటను నిలబెట్టు కోవడంలో ఆ విధంగా ఆయన తలమునక లవుతూ, ప్రథమంగా సాహిత్యజీవి అయిన తాను, చేయాలను కొన్న వాటిని తప్పని సరయి వుపేక్షింప వలసివచ్చింది. తన నిజమైన ప్రతిభకూ, చైతన్యానికీ న్యాయం చేకూర్చలేకపోయానని యిందు కాయన పరితపించారు. యీ భావం వెన్నాడడం వల్లనే పదేపదే సాహిత్య కృషిని ఆయన చేపట్టేవారు. అంతలోనే ప్రతి తరుణంలోనూ ఆ కృషిని ఆయన వదలి వేయవలసి వచ్చింది. సాహిత్యం, పోటీ ప్రేమాభి మానాలను సయించని దురభిమానవతి అయిన అర్ధాంగి లాటిదని ఆయన గ్రహించి, విజయనగర సంస్థానం నుంచీ యెప్పుడు పదవీ విరమణ చేద్దామా అని ఆత్రంతో యెదురుచూస్తూ వుండేవారు.

ఆయన కోరిక చివరకు నెరవేరింది. 1913 ఫిబ్రవరి 12 వ తేదీనాడు సంస్థానాధికారులు ప్రత్యేకంగా తగిన జీవిత భృతి నిచ్చి, పదవీ విరమణ చేయడానికి ఆయనకు అనుమతిని యిచ్చారు. యితర విధాలకూడా వారు ఔదార్యం చూపించారు. గత యెన్నోయేండ్లుగా నామమాత్రం అద్దె చెల్లిస్తూ వుంటున్న యింటిని, వారు ఆయనకు వుచితంగా యిచ్చివేశారు. దాన్నిబాగు చేసుకోడానికి కూడా తోడ్పడ్డారు. సొంత గ్రంథాగారాన్ని యేర్పాటు చేసు కొనేందుకు, పాత యింటికి ఒక వాటాను కవి అదనంగా అమర్చుకొన్నారు. యెన్నోయేండ్లుగా అపేక్షతో సేకరించిన పుస్తకాల మధ్య కూర్చొని సాహిత్య పథకాలకు సంబంధించిన కృషిని కొనసాగించగలిగారు. ముందు ముందు వుపయోగపడవచ్చునని, అపుడపుడు తనలో మెదిలే ఆలోచనలనూ, బహు ముఖమయిన తన అనుభవాలనూ, అయా ప్రదేశాలమీద కలిగిన తన అభి ప్రాయాలనూ, జీవితమూ, సాహిత్యమూ గురించిన తన భావాలనూ, మాన వునికీ, మానవ ప్రకృతికీ, మానవ భవిష్యత్తుకూ సంబంధించిన అవగాహన లనూ, నమోదు చేస్తూనే వస్తున్నారు. నైగనిగ్యంతో తనను ఆకట్టుకున్న

ప్రతి చతురోక్తి మెరుపునూ, ప్రతి చమత్కారాన్నీ, ప్రతి వాజస్తుతినీ, ప్రతి వ్యంగ్యోక్తినీ, ఆకర్షణతో, వాడీవేడితో తనను ఆశ్చర్యచకితున్ని చేసిన వాడుక భాషయొక్క ప్రతి విలక్షణమైన అంశాన్నీ, నాజూకునూ, రాసిపెట్టు కుంటూనేవున్నారు. యీ విధమైన సంపదతో ఆయన డైరీలూ, నోటు పుస్తకాలూ, నిండిపోయాయి. ఆ కారణంవల్లనే అయన శీఘ్రంగా, ఫలప్రదంగా పనిచేయగలిగారు. ఆయన వూహలో పుట్టిన అనేక పాత్రలు తమ పాత్రల్ని నటించి, తమ ఆత్మల్ని వెల్లడించి, తమ భవితవ్యాలను సాధించవచ్చునని వెలికి వురకడానికి ఆరాటపడుతున్నాయి. దీనికి తోడు, కళింగ చరిత్రకోసం సమకూర్చుకున్న శాసనాది విషయ సంపద—యెన్నో దశాబ్దాలుగా పెట్టెల్లో బంధింపబడింది—బయటకు యెప్పుడూవద్దామా అని ఆవేదన పడుతోంది. యింతకంటే దయనీయమయింది వాడుక భాష ఆక్రందన. వాడుక భాషను దానికి న్యాయంగా చెల్లవలసిన సాహిత్య సామ్రాజ్య సింహాసనం మీద అధిష్ఠింప జేయాలనే సంకల్పంతో యుద్ధం చేస్తున్న ఆయన, దాన్ని ఛాందస పండిత శత్రువులు నోరు నొక్కి నలిపి వెయ్యడానికి ఎలా వదిలి వేస్తారు? అవును ఆయన చేయవలసింది యెంతోవుంది. ఒక పదేళ్లు లేదా కనీసం అయిదేళ్ళువున్నా, చాలా భాగం పూర్తిచేసి వుండేవారు.

అది కుదరలేదు. మరీ తొందరగా మృత్యువు ఆయనను చుట్టుముడుతుంది. తనను చేరడానికి అది మెట్లెక్కివస్తోంటే దాని అడుగుల సవసవలు ఆయన వినగలుగుతున్నారు. యే క్షణంలో అయినా యిప్పుడది ఆయనను కబళించవచ్చు. మృత్యువు దుర్వారమైంది. అయితే మృత్యువు వాత పడక ముందు, కడసారి జీవితానందం అనుభవించాలని ఆయనకు బుద్ధిపుట్టింది. పడకగది తలుపులూ, కిటికీలూ తెరవండి, యెండి వరుగయిపోయిన ఆయన ఒంటి మీదుండే యిజారూ, శాలవాలూ విప్పండి. మిలమిలలాడే సూర్యకిరణాలు ఆయనను ముద్దుపెట్టుకోనివ్వండి. చల్లటి పొద్దుటిగాలి ఆయనను లాలించనివ్వండి. యెవరో వొకరు ఆయనకు ప్రీతి పాత్రమయిన వైనునూ, కంకెడు తాంబూలాన్ని తెండి; కవిగారి కుమారుడు కుటుంబ వైద్యుడి వైపు బిత్తరపోయి చూస్తాడు. దిగులుగానే వైద్యుడు అంగీకార సూచకంగా తల ఆడిస్తాడు. మద్యం తేవడమైంది. చివరిబొట్టు దాకా కవి దాన్ని ఖాళీచేస్తారు, తాంబూళం కూడా తెచ్చి యివ్వడం జరిగింది. ఆనందంగా కవి దాన్ని నములుతారు. సంతోషంగా గడిపిన రోజుల వేలాది స్మృతులు ఆయనలో వున్న

ట్లుండి కదలాడుతాయి. పాలిపోయిన ఆయన ముఖం ఒక అప్రాకృతమయిన కాంతితో కళకళలాడుతుంది. అన్ని బరువు బాధ్యతలూ, అన్ని ఆందోళనలూ కడకు తీవ్రమయిన అస్వస్థత బాధలూ ఆయనకు దూరమవుతాయి. ఆయనలోని కొంటెతనం మళ్లీ పుంజుకుంది. వైద్యునివైపు తిరిగి కొంటె చూపుచూస్తూ అంటారు కదా: "డాక్టరుగారూ! నేను ఐతికానా ఆహార విజ్ఞానంమీద పుస్తకం రాస్తాను. చాలాకాలం మీరెంతో గట్టిగా పథ్యంపెట్టి ఆ విషయంమీద నన్ను 'అథారిటీ' చేశారు". పరిహాసం ముగించారో లేదో, మృత్యువులోపలికి అడుగుపెడుతుంది. స్థానిక పత్రికా విలేఖరులు దగ్గర్లోవుండే టెలిగ్రాపు ఆఫీసుకువెళ్ళి తంతిద్వారా దుఃఖవార్తను పంపుతారు: "కవి గురజాడ వేంకట అప్పారావు మరణించారు" అని.

అయితే నిజంగా ఆయన మరణించారా? లేదు. ఆయనకు మృత్యువు "జీవన ద్వారం". తద్వారా మరింత విస్తృతమయిన, మరింత సత్యమయిన, మరింత శక్తివంతమయిన జీవితంలోకి నిష్క్రమించారు. జీవించివున్న రోజుల్లో తెలుగు సాహిత్యంలో అగ్రగామిగా ఆయన ప్రభావం అతిస్వల్పం. దాదాపు తృణప్రాయం. అభిమాని ఒకడువుంటే, అప్రతిష్ఠపాలు చేసేవాళ్ళు కొల్లలు కొల్లలు. మరీ తప్పులు పట్టని వాళ్లు ఆయనను అధ్వాన్నమయిన కవిత్వావగాహనా, అంతకంటే అధ్వాన్నమయిన పాండిత్యమూవుండే మిడిమిడి కళాభిమాని అన్నారు. తక్కిన వాళ్ళు బూటకపు మనిషి అని ముద్రవేశారు. ఆయన గొప్ప నాటకం 'కన్యాశుల్కం'కూడా వాళ్ల ఆక్షేపణలనుంచీ పూర్తిగా తప్పించుకోలేదు. చతురోక్తి, చమత్కారమూ, శక్తీ, చురుకుదనమూ అనే సుగుణాలు వున్నాయని ఒకవైపు ఒప్పుకుంటూనే, 'కన్యాశుల్కం' లోని అభిరుచినీ, నైతిక దృష్టినీ వాళ్ళు శంకించారు. సృజనాత్మక సాహిత్యభాషగా వాడుక భాషవుండాలనే గురజాడ వాదం, ఆయన కవిత్వంకంటే, నాటకం కంటేకూడా వాళ్ళను ఒళ్లు మండింపజేసింది. బజారు భాష, పొలాల భాష, ఫ్యాక్టరీల భాష, రోజువారీ బతుకులోని మొరటయిన అడ్డదిడ్డపు భాష. అధిష్ఠాన దేవత, సాహిత్యాది సమస్త కళల మూర్తిమత్వమయిన సరస్వతి ఆరాధనకు యెలా అర్హమవుతుంది? అది అపస్వరాలతో ఆమె సున్నితమైన శ్రవణేంద్రియాలను కష్టపెట్టదా; ఆ పాడు పచ్చిపచ్చి మాటలతో అది ఆమె సుతిమెత్తని మనస్సును బాధపెట్టదా అని వాళ్లు గర్జించారు. తాను అర్ధచదువు

మనిషి కాబట్టి, అర్ధచదువుగాళ్ళ భాష అయిన వాడుక భాష తరపున పోరాడుతున్నాడని వాళ్ల గట్టి నమ్మకం.

గురజాడపట్ల ఛాందస పండితుల ప్రచండ వ్యతిరేకత ఆశ్చర్యాన్ని కలిగించ నవసరంలేదు, యెందుకంటే అన్నిట్లోనూ ఆయన వాళ్ళకు విరుద్ధమే. అయితే ఆయన జీవితకాలంలో కొద్దిమంది అభిమానులయినా, ఆయన అడుగు జాడల్లో యెందుకు నడవటానికి సిద్ధపడలేదననేది యెవరి నయినా ఆశ్చర్యపరుస్తుంది. వాళ్లెవరు కానీ వాడుక భాషలో నాటకాలు రాయలేదు. ఆయన ఆవిష్కరించిన కొత్త ఛందస్సులో గీతాలను రచించలేదు. తెలుగు సాహిత్యానికి ప్రప్రథమంగా ఆయన ప్రసాదించిన కథానికపట్ల తగిన శ్రద్ధనూ చూపలేదు. తన కాలానికంటే ఆయన చాలా ముందుండడమే దీనికి ఒక కారణం కావచ్చు. ఆయన రచనలు రాశిలో పెద్దగా లేకపోవడం రెండో కారణం కావచ్చు. ఒకపూర్తి నాటకం, రెండు అసంపూర్ణమైన నాటకాలు, అయిదు కథానికలు (అందులో ఒకటి ఆంగ్లంలో), ఒక చిన్న పద్య గేయ గుచ్ఛం, ఒక చిరు వ్యాస గుచ్ఛం అన్నీ దాదాపు అంతే. కన్యాశుల్కం, నీల గిరి పాటలు మినహాయిస్తే యితర రచనలు స్వల్పపరిమాణంలో వుండేవి కూడా, ఆయన జీవితకాలంలో గ్రంథ రూపంలో వెలువడలేదు. వాడుక భాషలోనే రాయాలనే ఆయన పట్టుదల కారణంగా ఆనాటి ప్రముఖ పత్రికలు గురజాడ రచనలను ప్రచురించడానికి విముఖత చూపాయి. మొత్తం రాయడమే అంత తక్కువగా వున్నప్పుడు, ఆ తక్కువగా రాసిన రచనలకు సయితం విస్తృతమయిన ప్రచారం నిరాకరింపబడి నప్పుడు ఆయన ప్రభావం తక్కువగా తప్ప మరొక రకంగా యెలా వుంటుంది?

యేమయినా, ఆయన మరణించిన చాలా కాలానికి తప్ప, గురజాడ ప్రభావం ఆయన జీవించివున్న రోజుల్లో సువ్యక్తం కాలేదనేది అనివార్యమైన సత్యం. ఆదిలో చిన్న ధారగావుండిన గురజాడ ప్రభావం ప్రారంభంలో నెమ్మదిగా, ఆ తర్వాత వేగంగా, పెరిగి పెద్దదయి, రానురాను పరవళ్లు తొక్కే ఒక మహా ప్రవాహంలాగా అయింది. ముప్ఫయిలనుంచీ, కొందరు వులిపి కట్టెలూ, పెడకట్టెలు తప్పిస్తే, తెలిసో తెలియకో ఆ మంత్ర ప్రభావం కిందికి రాని తెలుగు రచయిత లేటూలేదు. ఆధునిక తెలుగు రచయితలలో కెల్లా ఆయన అత్యధిక ప్రశంసనీయులు. చర్చనీయులు, ఆదర్శప్రాయులు. ఆయన వదిలిపెట్టి పోయిన ప్రతి చిత్తునూ, సేకరించడం, పాఠాంతరాలను

సరిచూడడం, పరిష్కరించడం, ప్రచురించడం జరుగుతోంది. ఆయనను మార్గదర్శకునిగా పేర్కొంటూ పద్యాలూ, పాటలూ, ప్రస్తుతులూ, విమర్శలూ, వ్యాసాలు, జీవిత చరిత్రలూ వెలువడుతున్నాయి. ఆంధ్రప్రదేశ్ లోని ప్రతి పట్టణంలోనే కాకుండా, ఆంధ్రులుండే ప్రతి రాష్ట్రేతర కేంద్రంలోనూ, గురజాడ శతజయంతి 1962 లో ప్రేమతో. భక్తితో జరిగింది. తాము అభ్యుదయ రచయితలమని సగర్వంగా చెప్పుకొనే వాళ్లు గురజాడమీద భక్తి పారవశ్యంతో తబ్బిబ్బై, ఆయనను తమ సాహిత్యారాధనలో కీలకమైన వ్యక్తిగా చేశారు. సాంప్రదాయవాదులుకూడా ఆయనను హేళనతోకొట్టి పార వేయడం మానుకున్నారు. అలాంటప్పుడు గురజాడ విషయంలో మృత్యువు జీవన ద్వారం కాదనటానికి యెవరు సాహసిస్తారు!

## 2. ఉల్లాస జీవి

'స్వాగతం నీకు ఉల్లాస జీవి'

—ఎ. బి. షెల్లీ

మేధావిగా, భాషా విజ్ఞానవేత్తగా, కవిగా, నాటక రచయితగా, అన్నిటికిమించి ఒక ద్రష్టగా గురజాడ అప్పారావుపంతులు తన కాలానికంటే ముందుండడమే కాదు; పుట్టడంకూడా ముందే. నెలలు నిండకుండానే, యేడో నెలలో 1862 సెప్టెంబరు 21 వ తేదీ ఆయన జన్మించారు.† యీ తొందర పాటుకు, యీ పురవడికి ఆయన నిజంగానే అధికమూల్యం చెల్లింపవలసి వచ్చింది. వోల్టెర్ వృద్ధాప్యంలో "చాలా పీలగా యెముకల గూడులా" "మనిషిలాగా కన్నా యీకలు పీకిన కోడిలా" కన్పించేవాడట! అప్పారావు తన జీవితంలోని యేదశలోనూ అంతకంటె మెరుగ్గాలేరు. పసిబిడ్డగా వున్నప్పుడుగానీ, కుర్రవాడుగా వున్నప్పుడు కానీ, యువకుడుగా కూడా వున్నప్పుడు కానీ ఆయనిది దిట్టమయిన ఆరోగ్యం కాదు. వయోజన జీవిత పర్యంతం ఆయన దాదాపు జబ్బు మనిషే.

† ఆయన జీవిత చరిత్రకారులు కొంతమంది ఈ తేదీని అంగీకరించలేదు. 1861 నవంబరు 30 అని వాదించారు.

మరణాంతకమయిన జబ్బుకు యేడెనిమిది నెలల ముందు తన శారీరక రుగ్మతలను గురించిన ఒక సుదీర్ఘమయిన నివేదికను, యావజ్జీవిత మిత్రుడూ, వివిధ సాహిత్య యుద్ధాలలో ధీర సహయోధుడూ అయిన గిడుగు వెంకట రామమూర్తికి అప్పారావు పంపారు. ఆ నివేదిక ప్రకారం జీవితపు చివరి క్షణాల్లో అప్పారావు బరువు 73 పౌండ్లకు మించిలేదు. యిరవయి యేండ్ల క్రితం ఆ బరువు కేవలం 81 పౌండ్లు, 84 పౌండ్ల మధ్యవుండేది. అమిత అల్పకాయుడుగా, అమిత దుర్బలుడుగా వుండడంవల్ల, వాతావరణంలో యేమార్పు వచ్చినా—ముఖ్యంగా శీతల వాతావరణం—యెక్కువ తలకిందులు చేసేది. అందువల్ల ఆయన నిరంతరం జాగ్రత్తగా వుండవలసి వచ్చింది. యింట్లోనే వున్నప్పుడు సయితం, వున్న దుస్తులు ఒకదానిమీద ఒకటి ధరించాలి. నడుస్తున్నా, గుర్రపు బండిలో షికారుకు వెళ్ళినా గాలి తగలకుండా గొడుగు పట్టుకోవాలి. పర్వత స్థావరాల్లో గడిపేటప్పుడు ఆయన మాటలోనే చెప్పాలంటే, తాను “షర్టుమీద షర్టు, కోటుమీద కోటు” వేసుకుంటారు. యెరాస్మస్‌కూ, గోథకూ (యిద్దరూ గురజాడకంటే యెంతో గొప్ప ప్రతిభా సంపన్నులు, ప్రఖ్యాత వ్యక్తులు) కూడా చలిగాలులంటే బొత్తిగా బొత్తిగా పడేవి కాదని స్టీఫెన్ జ్విగ్ రాసింది మనకు తెలుసు. యెరాస్మస్‌ను గురించి తెల్పుతూ జ్విగ్ యిలా అంటారు: “చలిగాలి యేమాత్రం తగిలినా పిప్పిపంటిమీద మంచుగడ్డ పెట్టినట్లు సున్నితమయిన ఆయన శరీర తత్వంమీద పనిచేసేది”. జర్మన్ మహాకవిని గురించి మనకు తెల్పుతారు కదా: “గోథ అరవయ్యోపడిలో లావుకావడం మొదలుపెట్టారు. చలిగాలులంటే కంపర మెత్తిపోయి, చలికాలంలో శరీరానికి శుభ్రమైన గాలి బొత్తిగా తగలకుండా జాగ్రత్తపడేవారు”. అప్పారావు విషయం మరింత అన్యాయం. యెనభైయేళ్ళు జీవించి, డెబ్బయి యేళ్ల తర్వాత, ఆయన అత్యుత్తమ రచనలలో కొన్నిటిని రచించిన గోథలాకాదు; అప్పారావు యాభై మూడవ యేట మరణించారు. తన జీవిత కాలంలో అత్యధిక భాగం ప్రతి రుతువులోనూ, రాత్రింబవళ్లు ఆయనే వర్ణించినట్లు “వాతావరణ పరిస్థితులనుబట్టి శాలువానో, శాలువాలో, టోపీలో, కోట్లో, యిజార్లో” యెంతో ప్రయాసపడి సర్దుకోవలసి వచ్చేది.

అంతమాత్రమేకాదు. ఆయన నరాలూ, పేగులూ మహాసున్నితమయినవి. ఆయన జీవితకాలంలో అధిక భాగం అవి ఆయనను హింసించాయి. తర్వాత సన్నిహితమైన మిత్రుని దృష్టికి తేవడం కోసమే నివేదికను

రాస్తున్నాడు కాబట్టి, అన్ని సంగతులూ మిత్రుని ముందుంచడానికి గురజాడ సందేహపడలేదు. కాబట్టే యిలా రాస్తూ వెళ్ళారు :

"స్త్రీ సుఖం తర్వాత మనసు తీవ్రమయిన భావోద్రేకానికి గురి అయ్యేది. నిద్రవచ్చేది కాదు. ఒక్కొక్కప్పుడు చంకలో నరాలు లాగేవి. నిద్రరాని జబ్బువుండేది. అయితే కాఫీ తాగడం మూర్ఖంగా కొనసాగించాను. కాలేజీలో లెక్చరరుగా వుండేవాణ్ణి. చాలా యెక్కువగా చదవటం అలవాటయింది. కేవలం యాంత్రికంగా యేం చదివినా కూడా మనస్సు అలసిపోయ్యేది. నాలుగడుగుల (సయితం) నడవలేక పోయేవాణ్ణి."

అయినా, ఆయనమీద సమకాలికులకు మొత్తంమీద కలిగిన అభిప్రాయం యేమిటంటే ఆయన యెప్పుడూ ముక్కుతూ, మూల్గుతూవుండే రోగిష్ఠి మనిషి అనీ, దిగులు దిగులుగా కన్పించే మనిషి అనీ కాదు; ఆయన ఆనందంగా పాటలు పాడే కోయిల, గంతులువేసే గుర్రం పిల్ల; తుళ్ళితుళ్ళి పడేవాగు, వసంత మధ్యంలోని వుదయం అని. శరీరంపై ఆత్మశక్తి విజయానికి యిది వుదాహరణ. ఆయన ఆత్మశక్తి యెంత వుల్లాస పూరితమైనదంటే ప్రకృతిలోని అందాలన్నిటినీ ఆస్వాదించడానికీ, జీవితపు సంతోషాలన్నిటినీ చవి చూడటానికీ, మానవజాతి కళలన్నిటిలోనూ ఆనందించడానికీ, యేదీ ఆయనను అడ్డుకోలేదు. యెంత జబ్బుగావున్నా, చమత్కార సన్నివేశంలో కడుపుబ్బ నవ్వకుండా మానరు. తన కష్టాలూ కడగండ్లు తడిసి మోపెడయినా, వినోదాత్మకమైన పరిహాసమో, చతురోక్తో, అతికినట్లుమాటకు మాటో, విసరకుండా వుండరు. వెల్లువ వచ్చిన నదిలా, ప్రతి అవరోధాన్నీ ఆయన ఆత్మశక్తి ముంచెత్తుతుంది.

అటువంటి ఒక అవరోధం, చిన్ననాటి పేదరికం. నిజమే, మానం కాపాడుకోడానికి చింపిరి గుడ్డలు కట్టుకొని యేదో గుడిసెలో ఆయన పెరగలేదు. పస్తులు వుండలేదు. కానీ పుట్టినప్పుడూ, ఆ తర్వాత చాలా యేళ్ళూ, ఆయన తల్లి దండ్రులు దారిద్ర్యరేఖకు పెద్దగామించిలేరు. యీ దశ అంతటా ఆయన తండ్రి వెంకట రామదాసు విజయనగర సంస్థానంలో వుద్యోగం చేస్తున్నా, ఒక పేష్కారు మాత్రమే—క్రింది స్థాయి రెవెన్యూ వుద్యోగి అన్నమాట. ఆయన తండ్రి పరిమితాదాయం కారణం కావచ్చు—తండ్రి వుద్యోగం

చేసే కుమరాం అనే పల్లెటూళ్ళో బడిగానీ, ప్రయివేటు ట్యూటరుగానీ లేక పోవడం నిస్సందేహంగా కారణమే - అప్పారావు బాల్యంలో జన్మస్థలమైన రాయవరంలో - కొంత స్థితిపరులైన తాతగారింట్లో గడపవలసివచ్చింది. యిక్కడే ఆయన తన తొలి పాఠాలను నేర్చుకున్నారు. తొలి చిలిపి పనులు చేశారు. తొలినాటి స్నేహాలు చేసుకొన్నారు. వుల్లాసంగా గడిపారు.

అయితే వెంటనే రంగం మారింది. రామదాసు యేళ్ళతరబడి మిత వ్యయంచేస్తూ ఆదాచేసి గులివిందాడలో యిల్లూ, కొంత పొలమూ, కొను క్కోగలిగారు. అక్కడ ఆయన కుటుంబం స్థిరపడింది. అందువల్ల అప్పా రావు గులివిందాడలో వొక ప్రయివేటు ట్యూటరు దగ్గర చదువుకొన సాగిం చడానికి రాయవరం వదలవలసివచ్చింది. ఆ ట్యూటరు గురజాడకు తెలుగు, సంస్కృతం, ఆంగ్లం బోధించారు. మంచి పండితుడు కావడంవల్ల, ఆ ట్యూటరు అప్పారావులో భాషలపట్ల అభిమానాన్ని రేకెత్తించగలిగారు. యేళ్లు గడిచాక, ఆ అభిమానం గాఢమైన ప్రేమావేశంగా రూపొందింది.

రెండేండ్లు గడిచాయో లేదో మళ్ళీ రంగం మారింది. రామదాసు బదిలీ అయిన చీపురుపల్లి గులివిందాడలా కాదు, చిన్నపట్టణం. అక్కడ ఒక ప్రాథమిక పాఠశాల వుంది. అప్పారావును ఆ పాఠశాలలో చేర్చారు. పాఠ శాలలోని పిల్లలందరిలోనూ, ఆయన అత్యంత అల్పకాయుడు. బాగా తెలివిగల వాడు. అతి చిలిపి కుర్రవాడు. తరగతి గదిలో కూర్చొని రహస్యంగా తమ వుపాధ్యాయుల వ్యంగ్య రేఖా చిత్రాలను గీసేవాడు. తరగతి బయట చక్కగా వాళ్ల విలక్షణ స్వభావాలను అనుకరించేవాడు. వారాంతాల్లో యేగిరేవాడు, వీధుల్లో కుప్పిగంతులేసేవాడు; పొలాలు చక్కర్లు కొట్టేవాడు. నాన్న వూళ్ళో లేనప్పుడు, యింకాస్త దూరం పోయేవాడు. పండ్ల తోటలమీదచేసే దాడులకు నాయకత్వం వహించేవాడు. ఆనందకోలాహలంతో వర్షఋతువు తొలి వానల్లో పరుగులు తీసేవాడు. వాన నీళ్ళకు కాలవలు కడతాడు. నీళ్ళునిండి పారే టట్లు కాలువలకు అడ్డుకట్ట లేస్తాడు. నీళ్ళను లొంగదీసుకున్నందుకు మురిసి పోతాడు. దేశదిమ్మరులు, యెరుకలవాళ్లు, గారడీవాళ్లు, దొమ్మరివాళ్ళు, సాధువులు, బైరాగులు, జంగాలు తదితర సంచార బిక్షుకుల అద్భుతమైన రంగు రంగుల వింత దుస్తులంటే మురిసిపోతాడు. వాళ్ల ఆడే యెలుగొడ్లన్నా, డూ డూ బసవన్నలన్నా, చక్కటి శిక్షణ యిచ్చిన చిలకలు, కుక్కలు, కోతులన్నా, ఆకర్షితుడవుతాడు. జానపద గేయాలను, వీరగాథలను పరవశించి వింటాడు.

వీధి భాగవతులు ఆడే వీధి నాటకాలను కానీ, తోలుబొమ్మలాటలోళ్ల తోలు బొమ్మలాటను కానీ, సాధారణంగా ఆయన చూడకుండా విడచి పెట్టేవాడు కాదు. తోలు బొమ్మలాటలంటే మెచ్చుటపడి, తోలుకు బదులు కాగితాన్ని వుప యోగించి సొంత పద్ధతిలో ఆట బొమ్మల్ని తయారుచేస్తాడు. నేస్తుల హద్దూ పద్దూలేని వినోదంకోసం తన బొమ్మలాటల్ని ప్రదర్శించేవాడు. చూడడానికి పాఠాలంటే బొత్తిగా శ్రద్ధచూపేవాడు కాదు. అయినా పాఠశాలలో ఆయన అగ్రశ్రేణి విద్యార్థి. తెలివితేటలుచూచి ఒక స్థానిక స్కూళ్ళ ఇన్స్పెక్టరు ఆయన విషయంలో ప్రేమాభిమానాలను, శ్రద్ధాసక్తులను చూపాడు. పరీక్ష లకు ఆయత్తం చేశాడు. పదోయేటనో, పదకొండో యేటనో ప్రశంసనీయంగా ప్రాథమికవిద్యను ఆయన పూర్తిచేశాడు. యిప్పుడు పైచదువుకు వెళ్ళవగిన చోటు విజయనగరమే.

రామదాసుకు కొడుకంటె శ్రద్ధ. మొదటిబిడ్డ తనకంటే మంచిచదువు చదువుకోవాలి. కుర్రవానిలో కుశాగ్రబుద్ధీ, విద్యపట్ల ఆసక్తి, సూదంటు రాయిలాంటి గ్రహణశక్తి వున్నలక్షణాలు అప్పటికే వెళ్ళడయ్యాయి. నిజా నికి వయసుకుమించిన తెలివిపరుడు. విజయనగరమంటూ పంపగలిగితే తప్పకుండా వంశానికి వన్నె తెస్తాడు. పసివాడు ఒక కొత్త పట్టణంలో తన గొడవ తాను పడేటట్లు యెలా వదిలిపెట్టాలి? విజయనగరంలో చదువుకయ్యే ఖర్చులు భరించడమే కుటుంబానికి తలకుమించిన పని. మరి ఎలా కుర్ర వాడికి మరోవసతి కల్పించడం? యిబ్బందులు దుర్గమంగా కనిపిస్తున్నాయి. అయితే కొన్నాళ్ళు మాత్రమే.

విజయనగర సంస్థానం దివాను పి. జగన్నాథరాజు నిజాయితీకి, కార్యదక్షతకూ పేరుపడ్డాడు. జాలిగుండె మనిషికూడా. యిటీవల సంస్థానం అధికారుల సంక్షేమంపట్ల శ్రద్ధాశక్తులు కనపరుస్తున్నాడు. సంస్థానానికి చెందిన పాఠశాలల్లో పిల్లలకు ట్యూషన్‌ఫీజు మినహాయించడం ద్వారా కొందరు పేద అధికారులకు ఆయన తోడ్పడ్డాడు. ప్రత్యేకంగా కొందరి విష యంలో—యితర ఖర్చులనిమిత్తం చిన్నచిన్న మొత్తాలను మంజూరుచేశాడు కూడా. "యితరుల కిచ్చింది నాకు తప్పకుండా అందుతుంది" అని రామ దాసు అనుకున్నాడు. దివానుకు తన అభ్యర్థన తెల్పుకోడం కోసం ఆశపడి విజయనగరం ప్రయాణం అయ్యాడు.

రామదాసు ఆశ వ్యర్థం కాలేదు. అయితే ఆయన అభ్యర్థనను మన్నిస్తూ దివాను వెంటనే వేసిన పుత్తరవువల్ల సమస్య కొంతవరకే పరిష్కారమయింది. భోజన సదుపాయాన్నీ, వసతి సదుపాయాన్నీ యింకా చూడవలసేవుంది. విజయనగరంలో రామదాసుకున్న అనేక బంధువుల్లో యెవరైనా తన సాయానికి వస్తారా? రెండేళ్ళపాటు యెవరయినా తమ యింట్లో కుర్రవాణ్ణి వుంచుకొంటారా? "అప్పటికి నా ఆదాయం పెరగవచ్చు, లేదా మా అబ్బాయి తన చురుకైన బుద్ధితో, దేదీప్యమానమయిన తెలివి తేటలతో ఒక వుదారుడయిన పోషకుని దృష్టికి రావచ్చు," అని అనుకున్నారు. అదృష్టవశాత్తు తాను కలిసిన మొదటి బంధువే సాయపడ్డానికి యిష్టపడడమేకాదు, ఆతురత చూపాడు కూడా.

యీలోగా, యింట్లో కూర్చుని అప్పారావు యెన్నడూ లేంది వ్యాకులంగావున్నారు. పేదరికం దాని వెంబడివుండే తలవంపుల ఆలోచనలవల్ల జీవితంలో మొట్టమొదటిసారి అస్పష్టంగా కలత చెందివుండవచ్చు. యిది కేవలం వూహకాదు. ఆయన నోటు పుస్తకాలు ధ్రువపరచిన సంగతే. చాలా యేళ్ళ తర్వాత అందులో రాసుకున్నది యీ విధంగావుంది: "పేదరికం ఒక అవమానమని నేను భావించిన రోజులున్నాయి."

తరచుగా వయసులో చిన్నవాళ్లే పెద్దవాళ్లకంటె పేదరికాన్ని అతి తీవ్రమయిన విషయంగా పరిగణిస్తారు. పేదవాళ్లు దానితో తంటాలుపడడం నేర్చుకొని పేదరికపు వికృత ముఖాన్ని చాలా తక్కువగా గుర్తిస్తారు.

త్వరలోనే అప్పారావు వుల్లాస వ్యక్తి ఆయన వ్యాకులతను జయించింది. వుత్సాహంతో తండ్రివెంట విజయనగరం తరలివెళ్ళారు.† పట్టణం సమీపిస్తూనే ప్రప్రథమంగా చూసిన మొదటి చూపుకే వొళ్లు జలదరించింది. కళ్లు మెరిసాయి. ముఖం విప్పారింది. నీలపు కొండలు ఆనుకొని నీలాకాశం కింద తళతళమెరుస్తూ భవిష్యత్పోషకుని స్థావరం. భవిష్యద్విజయరంగస్థలం మౌనసంజ్ఞచేశాయి, "అప్పారావు సమున్నత భవితవ్యం కోసం."

---

† 1897 జనవరి 5 వ తేదీనాడు ఆయన దినచర్య పుస్తకంలో ఒక అంశంవుంది. అది యిలా: "విజయనగరంలో పాతికేండ్లు". ఈ తేదీనుంచీ వెనక్కి మళ్ళి చూస్తే, విజయనగరానికి 1872 జనవరి 5 వ తేదీ బయలుదేరినట్లు వూహించగలం.

# 3. చంచల జ్వాల

"ఆత్మ సహజంగా జ్వలనశీలమయితే
చంచల జ్వాల సహితం వెలుగులు విరజిమ్మవచ్చు"
—జార్జి సాంతీ ఆనీ

విజయనగరంలో అప్పారావు గడిపిన తొలినాళ్ళ భోగట్టా విశ్వసనీయంగా లభ్యంకాలేదు. యెప్పటిలాగే చురుకుదనంతో, వుల్లాసంతో తరగతిమీద తరగతి పూర్తిచేస్తూ వెళ్ళారు. ఆయన చిలిపితనం వదల్లేదు. ఆయన పిల్లచేష్టల్లో అన్నిట్లోనూ తోడూ, పురికొల్పేవాడూ మరెవరోకాదు, సాక్షాత్తు గిడుగు వేంకట రామమూర్తే. ఆయనకు యితర సావాసగాళ్లుకూడా వున్నారు. అయితే వాళ్ళలో యెవరూ గిడుగు వేంకట రామమూర్తి అంత ఆప్తులూ, ఆత్మీయులూ, సన్నిహితులూకారు, రెండు వేరువేరు గ్రామాలనుంచీ యిద్దరు జి. వి.లూ ఒకే యేడాది, వొకే బడిలో, వొకే తరగతిలో చేరడానికి విజయనగరం వెళ్ళారు. యిద్దరి స్వభావాల్లోనూ వుండే పోలికలవల్ల ఒకరికొకరు దగ్గరయ్యారు. జీవితంలో ఆ తర్వాత వాళ్ళ దారులు వేరయ్యాయి, కలిశాయి, మళ్లీ వేరయ్యాయి. వాళ్ళ అదృష్టాలు నిలకడగాలేవు. అయినా వాళ్ల బంధం తెగిపోలేదు. ఒక విధంగా మృత్యువుకూడా వాళ్ళను విడదీయలేకపోయింది. అప్పారావు అకాల మరణం చెందడంతో, రామమూర్తి వాడుక భాషను సాహిత్యంలో వాడాలనే యిద్దరి వుద్యమాన్ని రెట్టింపు వుత్సాహంతో, నాలుగింతలు దీక్షతో కొనసాగించారు.

రామమూర్తి స్నేహాన్ని సంపాదించడంలో అప్పారావు అదృష్టవంతుడు. అయితే మహారాజా కళాశాల ప్రిన్సిపాలు చంద్రశేఖరశాస్త్రి దృష్టిలో పడడంతో ఆయన యింకా అదృష్టవంతుడయ్యారు. చంద్రశేఖర శాస్త్రి పాతతరానికి చెందిన అపురూప వ్యక్తిత్వమున్న విద్యావేత్త. రాయవేలూరులో జన్మించారు. ఆంగ్లంలో, సంస్కృతంలో మంచి పండితుడు. విజయనగరానికి వలసవచ్చారు - కేవలం బ్రతుకు తెరువు కోసంగాక, తన ఆశయ సాఫల్యంకోసం. ఆధునిక విద్య విముక్తి ప్రదాయకమయిందన్న

దాంట్లో ఆయనకు ప్రగాఢ విశ్వాసం వుండేది. ఆధునిక విద్య సత్వరంగా వ్యాప్తి చెందకుండా, అజ్ఞానం, పేదరికం, అంధవిశ్వాసాలు, బానిసత్వం, సోమరితనం వీటి వూబిలోంచి భారతదేశం బయటపడలేదని ఆయన సముచితంగా విశ్వసించారు. కాబట్టి ఆయన దృష్టిలో విద్యార్థులంటే కేవలం తెల్లచొక్కా వుద్యోగాలకోసం, డిగ్రీలకు యెగబడేవాళ్లు మాత్రమే అనికాదు; వాళ్లు భావి ప్రపంచ వైతాళికులు; ఒకనూతన సమాజ నిర్మాతలు, ఒకనూతన జాతి నిర్మాతలు; ఆయన వాళ్ళను యెంతగానో ప్రేమించారు; తన వున్నతాశయాలను వాళ్ళలో వృద్ధిపింపజేయడానికి ప్రయత్నించారు. ఆయనకంటూ శక్తివుండివుంటే విజయనగరంలోని ప్రతిపేద విద్యార్థినీ సంతోషంగా తమ యింట్లో సాకి సంరక్షణచేసి వుండేవారు, ఆ శక్తిలేనందువల్ల, చాలా తెలివయిన వాళ్ళ మధ్యనుంచీ ప్రతిభావంతులైన వాళ్ళను యెన్నుకొనేవాళ్లు. అటువంటి విద్యార్థులు యెప్పుడూ ఆరుమందికంటే తక్కువ వుండేవాళ్లుకాదు. వాళ్ళకు భోజన సౌకర్యాలు, బట్టలు చక్కగా అమర్చేవారు. సొంతపిల్లలకూ, వాళ్ళకూ మధ్య యెలాంటి భేదమూ లేకుండా చూసుకొనేవారు.

విజయనగరం వచ్చాక రెండు మూడేళ్ళకు బడిలో మంచి మార్కులు రావడంతో, అప్పారావుకు శాస్త్రిగారింట్లో స్థానం లభించింది. అచిరకాలంలోనే శాస్త్రి తల్లిగారికి యెంత దగ్గరి వాడయ్యాడంటే, ఆమె అప్పారావును తన చిన్నకొడుకులాగా చూసేది. శాస్త్రినీ, శాస్త్రి తల్లిగారినీ అప్పారావు గొప్పగా అభిమానించారు, భక్తితో చూశారు. నిజానికి శాస్త్రి ఆయనకు పితృ సమానుడు. శాస్త్రి అంటే అప్పారావుకు యెంతటి అత్యున్నతమయిన గౌరవమంటే, భవిష్యత్పోషకుడయిన ఆనంద గజపతి శాస్త్రిగారికంటే కిందే అని ఒకప్పు డనుకున్నారు. శాస్త్రి జీవించి వున్నంత కాలమూ మహారాజావారిని దర్శనం చేసుకోడానికి కూడ అయిష్టపడేవారు. అప్పారావు నోటు పుస్తకాల్లో యిలా రాస్తారు:" యెప్పుడు పడితే అప్పుడు ఆయనను నేను చూడగలిగేవాణ్ణి. అయితే కీర్తిశేషులయిన ప్రిన్సిపాలుగారు బతికివుండగా, మహారాజా వారిని చూడాలని నాకు అంతగా అనిపించలేదు. ఆయనతో పోలిస్తే మహారాజావారు యెందుకూ కొరగారని అనుకునేవాణ్ణి." రానురాను మహారాజావారిని గురించి ఆయన తన అభిప్రాయాన్ని మార్చుకున్నది, ప్రేమించడం, గౌరవించడం నేర్చుకున్నదీ నిజమే ననుకోండి. అయితే మహారాజావారిపట్ల ఆయన భావాలు యేనాడయినా భక్తి స్థాయికి చేరుకున్నాయా అనేది చర్చనీయం.

వ్యక్తిత్వం రూపు దిద్దుకొంటున్న దశలో చంద్రశేఖరశాస్త్రి ప్రభావం కిందికి అంత ప్రత్యక్షంగా, అంత విస్తృతంగా రావడం నిజంగా అప్పారావు మహాద్భాగ్యం. ఆ మహాభాగ్యమే ఆయనలో గాఢమైన పుస్తకప్రియత్వాన్ని కలిగించింది, తృప్తియెరుగని జ్ఞానదాహం రగిలించింది; ఆయన దృక్పథం విశాలం కావడానికీ, ప్రతి స్పందన శక్తుల్ని నిశితం చేసుకోడానికీ, ఆదర్శ వాదిగా. మానవతావాదిగా పెంపొందడానికీ తోడ్పడింది. శాస్త్రిని ఆదర్శంగా వుంచుకొనే వుత్సాహంలో చేతికి అందినదల్లా ఆత్రంగా చదువుతున్నారు. భాషలపై, ముఖ్యంగా ఆంగ్ల సంస్కృత భాషలపై రానురాను స్థిమితంగా అధికమైన ప్రావీణ్యాన్ని సమకూర్చుకుంటున్నారు. అధ్యాపకుడుగా జీవిత సాఫల్యం పొందాలని నిరంతరం కలలు కంటున్నారు. అప్పుడప్పుడూ వాళ్ల నాన్న జేబు ఖర్చులకోసం యిచ్చే డబ్బులతో గంటస్తంభం దగ్గర అమ్మే పనికిరాని కాగితాల గుట్టల్లో కంటికి ఆనిన సెకండ్ హాండ్ పుస్తకాలను కొని ఒక చిన్న గ్రంథ భాండారాన్ని సమకూర్చుకోవడానికి ప్రారంభించారు. ఆ విధంగా కారు చౌకగా కొన్న అనేక గ్రంథాల్లో ఒకటి బన్యన్ రాసిన పిల్గ్రిమ్స్ ప్రోగ్రెస్. సంపూర్ణంగా ముగ్ధుడై, దాన్ని ఒకటి రెండుమార్లు కాదు, వరసగా నాలుగుమార్లు చదివారు. తెలుగు వాడుక భాషకోసం పోరాడే భావి యోధుని అంతరాంతరాల్లో అది గాఢంగా నాటిందా? నాటింది అనుకో వచ్చా? బన్యన్ భాషను ఆనాటి వాడుక భాషగా సాతీ అభివర్ణించలేదా?

అప్పారావు మెట్రిక్యులేషన్ ఖచ్చితంగా యెప్పుడు వుత్తీర్ణులయ్యారు? 1880 లో అనీ, 1882 లో అనీ రెండు సంవత్సరాలు పేర్కొనబడ్డాయి. మొదటిదే సబబుగా కన్పిస్తుంది. యేమైనా అది చాలా స్వల్పవిషయం. పరీక్షల్లో యెంత బాగా రాశాడంటే ఆయనకు ప్రథమ శ్రేణివచ్చింది.

అంతకంటే ముఖ్యమైందీ, విలువైందీ—1882 లో కవిగా ఆయన ఆకస్మికమైన, ఆశ్చర్యకరమైన ఆవిర్భావం. సందేహంలేదు. అది క్షణికా విర్భావమే. అయినప్పటికీ తర్వాత కాలంలో ఆయన విజయానికి అది మొట్ట మొదటి మసక వెలుతురు. ప్రథమ పురోభివృద్ధి సూచకం; ఆనంద భవిష్య త్సూచన, అంతవరకు ఆయన ప్రబలమయిన కోరిక అధ్యాపకుడు కావడం. అయితే ఆయన ఆలోచనలను కవిత్వం వైపు యేది తిప్పినట్లు?

కొన్నేళ్ళ తర్వాత తమ్ముడు శ్యామలరావు అన్నతోకలసి చదవడానికి విజయనగరం వచ్చాడు. అతడు కూడా ప్రజ్ఞావంతుడయిన కుర్రవాడు. చిలిపి

తనం ఆసలేలేదు. అత్యంత గంభీరుడు, పఠనశీలి, చిన్ననాటినుండీ యేదో రోజు తానొక కవి కావాలి అని కలలు కన్నాడు. అతడేమైనా అప్పారావులో నిద్రాణంగావున్న కవిని మేల్కొలిపాడా? అతనుకాదు. యేవిధంగా నయితేనేం అగ్రశ్రేణి కవిగా చివరకు ఆవిర్భవించారు.

ఆంగ్లంలో అప్పారావు రాసిన మొదటి పద్యం 'ఓడ్ టు ది కకూ'. స్థానిక పత్రికలో ప్రచురితమవుతూనే నలువురూ ప్రశంసించారు. నిజానికి రోజుల తరబడి పట్టణంలో పద్యప్రశంసే. శాస్త్రి తన శిష్యున్నిచూసి గర్వపడ్డారు. ఆనంద గజపతి ఆస్థాన సదస్యుల్లో ఒకరు. పద్యాన్ని ఆయన దృష్టికి తెచ్చారు. అప్పటి వుత్తర సర్కారు జిల్లాల స్కూళ్ల యిన్స్పెక్టరు మన్రో దాన్ని గురించి చాలా గొప్పగా అభిప్రాయపడ్డారు. యువ కవిని అభినందించారు. అప్పారావుకు భవిష్యత్తు వుంటుందని ప్రతి వొక్కరూ భావించారు.

కానీ, అప్పారావు కవితాజ్వాల అమిత చంచలంగావుంది. ప్రథమ ప్రజ్వలనానికీ, రెండవ ప్రజ్వలనానికీ మధ్య వొక యేడాది విరామంవుంది. రెండవ ప్రజ్వలనానికీ, తదనంతరం ప్రజ్వలనాలకూ మధ్య చాలా యేళ్లు యెంతగా అణగి వుండంటే దానినుంచీ పొగాలేదు, మంటాలేదు. యిది కాస్తా చిత్రమే, 1883 లో రచించిన మలి ఆంగ్ల పద్యకావ్యం 'సారంగధర' ప్రథమ రచన కంటే మరింత ఆదరాన్ని పొందింది. విస్తారమయిన ప్రశంసలను అందుకొంది. శంభు చంద్ర ముఖర్జీ (1839 - 1894) వంటి ప్రఖ్యాత పత్రికా రచయిత దానికి ముగ్ధుడై వెంటనే ఆయనను "నా ప్రియమయిన యువ కవీ" అంటూ ప్రీతితో సంబోధించడం ప్రారంభించారు.

ముఖర్జీ యీనాడు దాదాపు విస్మృతులు. కానీ ఆ రోజుల్లో భారత దేశంలోని ప్రధాన సంపాదకుల్లో వొకరు. "గౌడదేశపు రాజయిన ఆదిశూరుడు తన ప్రజలకు ధర్మమూ, మతమూ నేర్పడానికి కన్యాకుబ్జంనుంచీ పిలిపించిన" అయిగురు బ్రాహ్మణుల్లో వొకడయిన శ్రీహర్షుని వంశానికి చెందిన ముప్ఫయి నాల్గవ తరంవారు ముఖర్జీ. ఆయన 1839 లో, బెంగుళూరులో జన్మించారు. నైష్ఠికులయిన తల్లిదండ్రులకు ఒకే కొడుకైన ఆయన చదువు చిన్నప్పుడు సవ్యంగా సాగలేదు. కానీ అదృష్టవశాత్తు, హిందూ మెట్రోపాలిటన్ కళాశాల మొదటి ప్రిన్సిపాలయిన కెప్టన్ డి. యన్. రిచర్డ్సన్

ఆయన చదువు ముగింపు దశల్లో మార్గదర్శకుడయ్యాడు. పిన్న వయసులోనే ఆయన పత్రికా రచనను స్వీకరించారు. క్రిష్టో దాస్‌పాల్‌తో కలసి "కలకత్తా మంత్లీ మాగజైన్" పత్రికకు సహ సంస్థాపకుడయ్యారు. దానికి పుట్లోనే సంధి కొట్టాక 'మార్నింగ్ పేట్రియట్' తోనూ, దాని ప్రఖ్యాత యజమానీ, ప్రఖ్యాత సంపాదకుడూ అయిన హరీష్ చంద్ర ముఖర్జీతోనూ, సంబంధం కలిగిన కారణంగా, జాతీయ అంతర్జాతీయ వ్యవహారాలపై సమర్థుడైన నిశిత వ్యాఖ్యాతగా అమిత ప్రజ్ఞావంతుడయిన సాహిత్య విమర్శకుడుగా, ఆంగ్ల భాషా పాండిత్య విషయంలో ఆంగ్లేయులతోనే పోటీపడగలిగిన వ్యక్తిగా వెలుగులోకివచ్చారు. కానీ చపలచిత్తుడు కావడంవల్ల, పత్రికా రచనను దృఢంగా అంటిపెట్టుకోలేదు. అప్పుడప్పుడు దాన్ని దాదాపు వదలివేసేవారు. ఉపాధ్యాయ శిక్షణ సంస్థ ప్రధానోపాధ్యాయుడుగా, తాలూకాదార్ల సంఘం ప్రధాన కార్యదర్శిగా, ఒక భారతీయ మహారాజుగారికి దివానుగా, మరొకరికి కార్యదర్శిగా, మధ్యమధ్య కొన్నేళ్లు వుద్యోగాలుచేశారు. న్యాయశాస్త్రంతో కొన్నాళ్లు ఆడుకున్నారు. చాలామేళ్ళు హోమియోపతిని అభిమానించారు. కానీ, ఆయన మొదటి అభిమాన విషయమూ, చివరి అభిమాన విషయమూ పత్రికా రచనే. 1872 లో 'ముఖర్జీ మాగజైన్' సొంతంగా ప్రారంభించారు. 1882 లో కొత్తగా ఆరంభించిన వార పత్రిక 'రీస్ అండ్ రయ్యత్' తో దాన్ని సంలీనంచేశారు. దాని వుజ్జ్వల దశలో బెంగాలులోని ప్రఖ్యాత వ్యక్తులు సర్వేలేకాదు తదితర రాష్ట్రాల వాళ్లుకూడా దాని అను నిత్య పాఠకవర్గంలో గణించ దగ్గవాళ్ళే. అప్పటి రాజ్యపాలకులు మినహాయింపుకాదు. వైస్రాయ్ తర్వాత వైస్రాయ్ పత్రికలో వారం వారం ఆయన రాసేది చదువుతున్నారు– వొకప్పుడు ప్రశంసా పూర్వకంగా, మరొక్కప్పుడూ చికాకు పడుతూ,

శంభు చంద్ర ముఖర్జీలాంటి సంపాదకుడు దగ్గిర చేర్చుకోవడం కన్నా, ఆశీర్వదించడం కన్నా, భుజం తట్టడం కన్నా యువకుడైన అప్పారావుకు కోరతగింది యేముంటుంది? అప్పారావు 'సారంగధర'ను జి. వెంకట రామయ్య తన పత్రిక 'ఇండియన్ లీజర్ అవర్' లో ప్రముఖంగా ప్రచురించాక, ఆ ప్రతిని విజయనగరంనుంచీ పంపితే ముఖర్జీ యెంతగా సంబరపడ్డారంటే, దాన్ని తన 'రీస్ అండ్ రయ్యత్' లో పునర్ముద్రించుకొన్నారు. కావ్యం నిర్దుష్టమైందని కాదు; దాంట్లో కవికి మంచి భవిష్యత్తును దర్శించారు. కాబట్టే వెంకట రామయ్యకు వుత్తరం రాస్తూ ఆయన యిలా అన్నారు:

"అతని పద్యంలో చాలా లోపాలున్నమాట నిజమే. అయితే అతనిలో సరుకుంది. ముందుకు వెళ్ళనీండి. అతని పేరుకూ, పుట్టుకకూ, చదువుకూ, వ్యాపకాలకూ సంబంధించిన అన్ని వివరాలు తెలుసుకోవాలని నాకుందనేది చెప్పవలసిన అవసరం లేదనుకుంటాను."

అప్పారావే స్వయంగా ఆ వివరాలను అందించారు. అనతికాలంలో వయోధికుడయిన సంపాదకుడు యువకవికి మరొక పితృసమానుడయ్యారు. వాళ్ళిద్దరి మధ్యా వుత్తరాలు షుమారుగా నడిచాయి. దురదృష్టవశాత్తు నాలుగుమాత్రమే, ముఖర్జీ అప్పారావుకు రాసిన ఆ నాలుగు లభ్యమవుతున్నాయి. ఎఫ్. హెచ్. స్క్రయిన్ రాసిన ముఖర్జీ జీవిత చరిత్రలో వాటిని ప్రచురించడంజరిగింది. కొందరు అప్పారావును యెంతగా ప్రోత్సహించారో మరి కొందరు అంతగా నిరుత్సాహపరచినట్లు 1883 సెప్టెంబర్ 17 వ తేదీ రాసిన మొదటి లేఖ లోనే స్పష్టమవుతుంది. ముఖర్జీ రాస్తారు కదా:

"నువ్వుపొందిన నిరుత్సాహాలు ప్రత్యేకమయినవేమీ కావు. ప్రతిభ కానీ, మౌలికతగానీ వున్న ప్రతి రచయితా, తప్పని సరిగా ప్రతికవీ వాటికి గురికావలసిందే. నీ బాధలకు ఆశ్చర్యపడవలసిన కారణమే లేదు. యే దేశంలో అయినా మంచి సాహిత్యాన్ని అవగాహన చేసుకున్నవాళ్ళ సంఖ్య స్వల్పం. కవిత్వాన్ని అవగాహనచేసుకున్నవాళ్లు మరీ స్వల్పం. యూరప్‌లోని కవుల స్థితిని పరికించు. భారతదేశంలో పరిస్థితి దారుణం. విద్యావంతు లయినప్పటికీ ఆంగ్లో యిండియన్లు పాండిత్యంగానీ, విచక్షణగానీ, వున్నవర్గంకాదు. దేశీయుల సంగతి గురించి యేమంటాం? దేశీయ రచయిత ఒక ప్రత్యేకమైన యిబ్బందిలో వున్నాడు, దేశీయులు సాధారణంగా యూరోపియన్ల అంచనా కోసం ఆగుతారు. దేశీయులలో సమర్థులు సయితం తమ అభిప్రాయాన్ని ముందుగా చెప్పడానికి వెనుకాడతారు. దేశీయుడుయూరోపియన్ భాషలో కవిత్వం జోలికి పోవడం దుడుకు తన మన్నది నిజమే. కానీ యూరోపియన్లు దానిని దుడుకు తనంగాకూడా కాకుండా, తుంటరి తనంగా పరిగణించడానికి సముఖంగా వుంటారు. నల్లతోలు వచనం రాయటంతో సంతృప్తి చెందకుండా ఛందస్సుతో అడుకు

నేంతవరకు వెళ్ళడం అంటేనే వాళ్ళకు గంగవెర్రు లెత్తుతుంది. సారంగధరలో నువ్వు ప్రయత్నించే ఆధునిక నిర్యమక పద్యం (బ్లాంక్‌వర్స్) ప్రసిద్ధంకాదు. పోప్ అంత్యప్రాసల గలగలలు యింకా మనషుల బుర్రల్లో వున్నాయి. అవే నిజమైన కవిత్వంగా చలామణి అవుతున్నాయి. అయినా లెక్కపెట్టవద్దు. నిరుత్సాహ పడవద్దు.”

చిత్తశుద్ధితో యిచ్చిన యీ విజ్ఞతాయుతమయిన సలహాను అప్పారావు యెందుకు పాటించలేదు? ఆయన మళ్ళీ శ్రద్ధగా కవిత్వం రాయబూనుకో డానికి ముందు రెండు దశాబ్దాల దీర్ఘకాలం యెందుకు గడిచింది? యీ కాలంలోగానీ, మరే కాలంలోగానీ ఆయనకు ఆత్మవిశ్వాసం కొరవడలేదు. సులభంగా నిరుత్సాహపడే మనిషికూడా కాదు. ఆయిన అంతస్సత్వం దిట్ట మయింది. కాబట్టి కవిగా ఆయన దీర్ఘమౌనానికి ఒక కారణమే కన్పిస్తుంది. ఆయన కవితాజ్వాల చంచలమయింది. కానీ, యెప్పుడో ఒకనాడు అది వెలుగులు విరజిమ్ముతుంది, దేదీప్యమానంగా కూడా; ఆయన ఆత్మ సహజంగా జ్వలన శీలం కదా!

## 4. మార్పులూ, అవకాశాలూ

‘యీ మర్త్యజీవితపు అన్నిమార్పులూ, అన్ని అవకాశాలూ’

—సాధారణ ప్రార్థనల గ్రంథం.

అప్పారావు జీవితంలో 1882 కూ 1897 కూ మధ్యవున్న ఒకటిన్నర దశాబ్దపు కాలం యెన్నో మార్పులతోనూ, అవకాశాలతోనూ నిండివుంది ఆ దశప్రారంభంలో ఆయన అనేక ఘనకార్యాలు సాధించగలడన్న ఆశలు కలిగించే వుత్సాహవంతుడయిన యువకుడు, దశాంతంలో కొన్ని ఘనకార్యాలు అప్పటికే సాధించిన పరిణత వ్యక్తి. ఆయన చిలిపి తనం స్థానంలో సరసత్వం వచ్చింది; కొంటెతనం పోయి చతురోక్తులు వచ్చాయి, యెగతాళి హాస్య ప్రియత్వంగా మారింది. జీవితంలోని సుఖాలతోపాటు కష్టాలు అను

భవించినా ఆయన యింకా నవ్వేశక్తిని కోల్పోలేదు. కానీ ఆయన నవ్వు యిప్పుడు పగలబడి నవ్వడంకాదు. ఆ నవ్వు హద్దులోవుంది, అణచి పెట్టబడికూడావుంది. తరచుగా దాని వెనుక కన్నీటి చప్పుడు విన్పిస్తుంది. కొన్ని గట్టి యెదురు దెబ్బలు తిన్నప్పటికీ ఆయన యింకా కలలుగనే శక్తిని కోల్పోలేదు. అయితే యిప్పటి కలలు ఆచరణ దూరమైనవికావు. కొంత ఆశాభంగం పొంది నప్పటికీ, ఆయన యింకా జీవితాన్ని ప్రేమించే శక్తిని కోల్పోలేదు; అయితే పరమానంద భరితమైన క్షణాల్లోకూడా జీవితంలోని అనేక కష్టాలు, యెన్నెన్నో దుఃఖాలు ఆయన స్ఫృహలో వున్నాయి. యే దృష్టితోచూసినా, యీ పదిహేనేళ్ళు ఆయన వ్యక్తిత్వపు రూపురేఖలనూ, ఆయన అంతస్సారాన్నీ, ఆయన శక్తినీ, ఆయన దృక్పథాన్నీ దిద్దితీర్చడంలో నిర్ణయాత్మకమైనవి.

చిత్రమేమిటంటే యీ కీలకమైన దశలోని మొదటి మూడేళ్ళు విద్యా విషయకంగా దాదాపు చెప్పుకోదగ్గవికావు. మెట్రికులేషన్ పరీక్షలో ప్రశంసనీయంగా వుత్తీర్ణుడయినందువల్ల ఆయనకు వుపకారవేతనం లభించింది. కానీ యఫ్. ఏ. పరీక్షలో అక్కడి కక్కడికి దేకగలిగాడు. దాంతో వుపకారవేతనం పోయింది. యేడాదిపాటు ఆయన చదువు ఆగిపోవలసివచ్చింది. ఆయన తండ్రి రామదాసుకు యీలోగా రెండు ప్రమోషన్లు వచ్చాయి—మొదటిది జలాంతర యెస్టేటుకు అమీనుగా, రెండవది శృంగవరపు కోటకు సర్కిల్ సుపీరియర్‌గా, తన చిత్తశుద్ధివల్లా, సామర్థ్యంవల్లా ఆయన మహారాజావారి విశ్వాసం చూరగొన్నారు. అందువల్ల ఆయన ప్రాంతానికి చెందిన కొన్ని ప్రత్యేక సమస్యల గురించి ఆయనను మహారాజావారు అప్పుడప్పుడు సంప్రదిస్తూ, కొన్ని ప్రత్యేక కర్తవ్యాలను కూడా ఆయనకు అప్పగించేవారు. ప్రతి ప్రమోషన్‌తోనూ ఆయన జీతం పెరిగింది. ఆయన పొలంనుంచీ కూడా యిప్పుడు కాస్తా యెక్కువ ఆదాయం వస్తోంది. కానీ కుటుంబం పెరగడంతో ఖర్చులు కూడా పెరిగాయి. అందువల్ల తన అలక్ష్యంవల్ల వుపకార వేతనం పోగొట్టుకొన్న పెద్ద కొడుకు, చదువు మానుకొని వుద్యోగం చూసుకోవాలని ఆయన పట్టుబట్టారు. మార్గాంతరం లేనందువల్ల అప్పారావు స్థానికవున్నత పాఠశాలలో ఒక వుపాధ్యాయ పదవి ఖాళీగావుంటే, దానికోసం అర్జీపెట్టుకొన్నారు. చంద్రశేఖరశాస్త్రి సహకారంతో ఆ పదవి ఆయనకు సులభంగానే వచ్చింది.

యింతకు ముందే చెప్పినట్లు, ఉపాధ్యాయుడు కావాలనేది అప్పారావు గాఢమైన ఆకాంక్ష. అది ఆయన మొట్టమొదటి ఆకాంక్షకూడా. ఆయన యితర కోరికలు : డిష్టిక్ కలెక్టరు ఆఫీసులో హెడ్‌క్లర్కు కావాలనేదీ, లాయరు కావాలనేదీ, జడ్జి కావాలనేదీ. యివి అంత స్థిరమైన కోరికలు కావు; అంత గాఢమైన కోరికలుకావు. జడ్జికావాలనే కోరికను ఆయన వొకసారి లిఖిత రూపంలో వ్యక్తీకరించారు. తన యెనిమిదో యేట ఆయన వొకసారి తాతగారి వూరికి వెళ్ళారు. తాతగారు రాయవరంలోని జిల్లా మునసబు కోర్టులో శిరస్తదారు. ఒకరోజు సాయంకాలం, కోర్టు ముగిశాక అప్పారావు అటూ యిటూ తిరుగుతూ, జడ్జి గది తలవాకిలి దగ్గరకు వెళ్ళి, తలుపుమీద సుద్ద ముక్కతో పెద్ద అక్షరాలలో "జి. వి. అప్పారావు, బి.ఏ., బి.ఎల్., జిల్లా మునసబు" అని రాశారు. మరునాటి వుదయం గట్టిగా మందలించేందుకు ఆయనను జడ్జి యెదుటికి లాక్కొచ్చారు.

"నువ్వు జడ్జివని మోసపు ప్రకటనచేసినందుకు నిన్ను శిక్షించవచ్చు" అన్నారు జడ్జి. వయసుకు మించిన కోరికతో అప్పారావు సమాధానించారు కదా !

"కాదు సార్. నాదిమోసల ప్రకటనకాదు. అది నాకోరిక మాత్రమే."

కుర్రవాని చురుకైన జవాబుతో మనసులో కలిగిన యిబ్బందిని దాచుకోడానికి జడ్జి కాస్తా అనాలోచితంగా అన్నారు : "సరే, సరే, నీకోరికను కోర్టు తలవాకిలి తలుపుమీదే వెల్లడించాలా ? పక్కన గోడమీద రాయవచ్చు కదా ?"

అప్పారావు ఒప్పుకోలేదు. "అయితే సార్, నేను బొగ్గుతో రాయలేదు. సుద్ద ముక్కతో రాశాను. వెల్లవేసిన గోడమీద తెల్లని సుద్ద ముక్కతో రాయడం తెలివి తక్కువకదా !" అన్నారు.

కుర్రవాని పొగరుబోతు తనానికి కఠిన శిక్షపడుతుందని అప్పారావు తాతగారు భయంతో వణకిపోతున్నారు. కానీ కుర్రవాని చురుకుదనమూ, ధైర్యమూ జడ్జిని ఆకట్టుకొన్నాయి. "నీకోరిక యేదో ఒకరోజు నెరవేరుగాక" అని ఆయన కుర్రవాణ్ణి ఆశీర్వదించారు. కానీ ఆరోజు రానేలేదు. దానికి బదులు మరో రోజువచ్చింది, అప్పారావు వుపాధ్యాయుడుగా పాఠాలు చెప్పవలసిన రోజు మరీ త్వరగా వచ్చింది.

గాఢమైన ఆకాంక్ష తీరడం సర్వదా సంతోషదాయకంకాదు. ముఖ్యంగా వయసుకూ, సామర్థ్యానికి మించిన బరువైన బాధ్యతలు దానివెంట వచ్చినప్పుడు ఒక్కొక్కప్పుడు అది పూర్తిగా ఆయాసకరం కాకపోయినా, చాలా యిబ్బందికరంగా వుండవచ్చు. అప్పారావుకు కలిగిన స్థితి అలాంటిదే. తదనంతర కాలంలో ఆయన కళాశాలలో పాఠాలు చెప్పవలసి వచ్చినప్పుడు, అప్పటి ఆయన మనస్థితికి అది సరిపోయింది. కాబట్టి ఆ పని చాలా హాయిగా వుండింది. కానీ, వున్నత పాఠశాలలో మొదట చేసిన అధ్యాపకత్వం ఆయనను పూర్తిగా క్రుంగదీసింది. ఒళ్ళు చెయ్యని కుర్రవానిలా కనిపించే అప్పారావు తమ తరగతిలోని చిలిపి విద్యార్థులను మందలించడం ద్వారా అదుపు చేయడంగానీ, కొట్టడానికి పూనుకోవడంగానీ చేతకాలేదు. అందువల్ల, కొంత విసుగుతో, కొంత నిస్పృహతో మూడు నాలుగు నెలలలోపల ఆయన ఆ వుద్యోగాన్ని వదలి పెట్టవలసివచ్చింది.

కొడుకు నిర్వ్యాపారి కావడం చూసి రామదాసు మనసు మార్చుకోక తప్పలేదు. అయితే అప్పారావు మళ్ళీ కళాశాలలో చేరడానికి గడువుమీరిపోయింది. కాబట్టి ఆయన మళ్లీ వచ్చే విద్యాసంవత్సరం ప్రారంభం దాకా ఆగవలసివచ్చింది. ఆయనకు యిటీవల కలిగిన అపజయాలనూ, అవమానాలనూ, పరిగణిస్తే, కళాశాలలో మళ్లీచేరిన తర్వాత ఆయన తన పాఠ్య గ్రంథాల అధ్యయానికి సంపూర్ణంగా అంకితం కావలసివచ్చింది. కానీ ఆయన మొండి, రకరకాల యితర పుస్తకాలు చదవడం ఆయన కొనసాగించారు. నిర్ణీతమైన పాఠ్యపుస్తకాలపట్ల ఆయన యేవగింపు యెంత తీవ్రంగా వుండేదంటే, 1886 లో మొదటిసారి బి.ఏ., పరీక్షకు కూర్చున్నప్పుడు ఆయన వుత్తీర్ణుడు కాలేదు. ఆయన తండ్రి తీవ్రమైన ఆశాభంగానికి లోనయ్యారు. కానీ రెండో ప్రయత్నంలో కొడుకు ఆంగ్లంలో ప్రథమ శ్రేణిలో ఆధిక్యతతో వుత్తీర్ణుడయినప్పుడు తండ్రి యెంతో సంతోషించారు.

పరీక్ష ఫలితాలు వెలువడక మునుపే, చంద్రశేఖరశాస్త్రి చొరవవల్ల అప్పారావు మహారాజావారి కళాశాలలో యెనిమిదో అసిస్టెంటు లెక్చరరుగా నియమితులయ్యారు. కానీ, నెలకు 25 రూపాయల ముష్టి జీతం వచ్చే ఆ వుద్యోగంలో చేరడం ఆయనకు యిష్టంలేదు. న్యాయవాది కావాలనే తన కోరిక నెరవేరే మార్గం యేదైనా వుందా అని అప్పుడు ఆలోచించారు.

1885 లో ఆయనకు వివాహం అయింది. సంపన్నుడయిన మామగారు యేమైనా సాయంచేస్తారేమో అని పరోక్షంగా వివరించారు. శక్తివుండీ మామ గారు సాయం చేయదలచుకోలేదు.

అప్పటికీ, మహారాజావారి కళాశాలలో యెనిమిదో అసిస్టెంట్ లెక్చ రరుగా చేరడానికి అప్పారావు యిష్టపడలేదు. "నెలకు 25 రూపాయల జీతంతో నేనూ, నా భార్య యెలా బతగ్గలం" అని ఆయన తీవ్రంగా ఆలో చించారు. "ప్రభుత్వోద్యోగంలో యెందుకు చేరకూడదు? డిప్యూటీ కలెక్టరు ఆఫీసులో హెడ్‌క్లర్కు కావడం అనేకమయిన నా కోర్కెల్లో ఒకటి కదా? అది అంతహీనమైన ప్రారంభ వుద్యోగం కాదు. పై వాళ్ళను తృప్తిపరిస్తే, త్వరగా పైకి వెళ్ళే అవకాశాలు సయితం వున్నాయి." అలా ఆలోచించి ఆయన ఆ ఉద్యోగానికి దరఖాస్తుపెట్టి సులభంగానే సంపాయించారు కూడా. లెక్చరర్ వుద్యోగం నుంచీ లీవ్ తీసుకొని హెడ్‌క్లర్కుగా చేరారు. తన లాంటి యితర గుమస్తాలమీదనే అయినా యిప్పుడు తానొక హెడ్డు. యీ భావం కొద్ది వారాలపాటు అయనను వుత్సాహపరిచింది. కానీ. ప్రభుత్వ కార్యాలయంలోని దుమ్ముపట్టిన ఫైళ్ళతోనూ, నీరసమైన దైనందిన కార్య క్రమంతోనూ ఆయన త్వరలోనే అలసిపొయ్యారు. విముక్తికోసం ఆయన తపించారు.

అప్పారావు కోరకుండానే, స్కూళ్ల యిన్స్‌పెక్టరు నాగోజీరావు ఆయన తరపున చొరవ తీసుకున్నారు. అలాగే చంద్రశేఖరశాస్త్రి కూడా. యిద్దరూ కలిసి అప్పారావు ప్రజ్ఞాపాటవాలు బూజుపట్టిన ప్రభుత్వ కార్యాల యంలో దుర్వ్యయం కాకూడదని ఆనంద గజపతివద్ద విన్నవించుకొన్నారు. వాళ్లు 1887 లో విజయ దశమి రోజు అప్పారావుని మహారాజావారి దర్బారుకు తీసుకువెళ్లారు. మొట్టమొదటిసారి మహారాజావారిని చూసినప్పుడు అప్పారావుకు ఆయనను గురించి గొప్ప అభిప్రాయం కలిగింది. అదనుచూసి శాస్త్రి, నాగోజీరావు, అప్పారావును మహారాజావారికి పరిచయం చేశారు. అప్పారావుతో మహారాజావారు "మా కాలేజీకి మీ అవసరం వుంది. ప్రభుత్వ వుద్యోగం వదిలేసి మీరు తిరిగి మావద్దకు రాకూడదూ?" అని అన్నారు. కళాశాలలో మళ్లీ చేరమని తనను ఆహ్వానించిన అనుగ్రహ పూర్వకమైన ఆపద్ధతికి అప్పారావు పరవశులై తడబడుతూ మహారాజావారికి యెలాగో

కృతజ్ఞతలు గొణిగారు. సంస్థాన పరిపాలనలో జరిగే మామూలు జాప్యాల తర్వాత, నాల్గో అసిస్టెంట్ లెక్చరర్‌గా నెలకు వంద రూపాయలు జీతంపిచ్చిన ఆయనకు ఒక కొత్త నియామకపు ఉత్తరవు అందింది. ప్రతి సాయంకాలం మహారాజావారికి ఆనాటి పత్రికలు చదివి వినిపించేందుకు అదనంగా 25 రూపాయలు యీయ చూపారు. *

లెక్చరర్‌గా అప్పారావు రాణించారు. ఆయన ఆంగ్ల సంస్కృతాల తోపాటు, గ్రీకు చరిత్ర, రోమన్ చరిత్రకూడా బోధించారు. ప్రతిరోజూ ఆనాటి పాఠాలు చెప్పడంకోసం ముందుగానే యింటివద్ద చదివి సిద్ధమై వెళ్ళే వారు. మద్రాసు, బెంగుళూర్లలోని ప్రసిద్ధ అధ్యాపకుల పద్ధతులను ఆయన అధ్యయనంచేసి, నిత్యం తనను తాను మెరుగు పరచుకున్నారు. ఆయనకు అపారమైన దుఃఖం కల్గిస్తూ, చంద్రశేఖరశాస్త్రి 1888 లో మరణించారు. శాస్త్రిలాగే ఆంగ్ల సంస్కృతాల్లో ప్రముఖ పండితుడైన కె. రామానుజా చార్యులు ఆయన స్థానంలో ప్రవేశించారు. కొత్త ప్రిన్సిపాలు కూడా అప్పా రావుపట్ల దయగా వుండేవారు. 1891 లో ఆయనకు మూడో అసిస్టెంట్ లెక్చరర్‌గా ప్రమోషన్ వచ్చింది. నెలజీతం వందా యిరవై అయిదుకు పెరి గింది. బి. ఏ. తరగతులకు కూడా బోధింపసాగారు.

ఆయన భార్య అప్పల నరసమ్మ సరళ స్వభావం కలది, సాదా మనిషి, కానీ అభిమానవతి, మహా ఆచార పరురాలు. ఆమెతో ఆయనకు కుటుంబ జీవితం హాయిగా వుండింది. యెన్నో యేళ్ళ తర్వాత ఆయన కల కత్తాలో ఒక బాలికా పాఠశాలకు వెళ్ళిచూశారు. అక్కడి పాఠశాలల్లో సంస్కృత శ్లోకాల బోధనవుంది- ముఖ్యంగా పతిభక్తిని నొక్కిచెప్పే శ్లోకాల బోధన. పాకశాస్త్రం ఆచరణాత్మకంగా కూడా అక్కడ బోధించేవాళ్ళు. యివన్నీ చూసి, తననోటు పుస్తకాల్లో ఆయన యిలా రాసుకున్నారు:

"చిన్నప్పుడు నాభార్య అలాంటి బడికి వెళ్ళివుంటే బావుండేది. శ్లోకా లయితే ఆమెకు వందలకొద్దీవచ్చు. యే బళ్ళోనూ పాఠాలునేర్చుకోకుం డానే దివ్యంగా వంటచేస్తుంది. పూజలంటే మహాయిష్టం, ముఖ్యంగా బాగా డబ్బు ఖర్చు అయ్యేవి. ఆమె పరిపూర్ణమైన ఆదర్శ మహిళ,

* డా॥ జి. వి. సీతాపతి ప్రకారం యాభై రూపాయలు. మొదట యిరవై అయిదువుండి ఆ తర్వాత యాభైకి పెరిగి వుండవచ్చు.

బాలికా పాఠశాలలో చాలా మంచి టీచరవుతుంది. ఆమెకు ఒళ్ళంతా ఆచార పరత్వం వున్నా, వళ్ళించే శ్లోకాలన్నీకూడా ఆమెకు పతిభక్తి మీద విశ్వాసాన్ని కల్గించలేవు. అంతేకాక తన మొగుడు ప్రపంచంలో కెల్లా గొప్ప అవివేకి అనీ, అడుగడుగునా అతనికి కర్తవ్య బోధచేయ వలసి వుంటుందనీ ఆమె నమ్మకం. తన మొగుడు తనకు కుక్కిన పేనులా విధేయుడుగా వుండాలని ఆమె విశ్వాసం. స్త్రీలను గౌర వించాలని విద్యావంతులయిన మన యువకుల అఖల సహాయాసక్తి, అలాంటి చెత్తకు సంబంధించిన వాగుడు విన్న తర్వాత [యీ పాఠ శాలలో] పతిభక్తి పాఠాలు వినడం మనసుకు హాయిగా వుంది.''

యీ పరిహాసపు పలచని ముసుగు చాటున ఆయనకు భార్యపట్ల గల గాఢమయిన అనురాగమూ, అచ్చమైన మెచ్చుకోలూ కన్పిస్తాయి. కుటుంబ బాధ్యతలన్నిటినుంచీ ఆమె ఆయనకు విముక్తి కలిగించి, తానే సంసారం నిర్వహిస్తుంది. దీంతో ఆయనకు పౌర జీవితంలో పాల్గొనే తీరికలభిస్తుంది. అయన ఒక మునిసిపల్ వార్డులో పన్నుల చెల్లింపుదారుల సంఘానికి అధ్యక్షు డవుతారు. మునిసిపల్ కౌన్సిల్లో సభ్యుడవుతారు. విజయనగరం డిబేటింగ్ సొసైటీ కార్యకలాపాల్లో గాఢమైన ఆసక్తి కనబరుస్తారు. త్వరలో చురుకైన ఉపాధ్యక్షులుగా దానికి నాయకత్వం వహిస్తారు. జాతీయవాదుల సభల్లో ఉపన్యసిస్తారు. 'తెలుగు హార్స్' అనే స్థానిక పత్రికలో వ్యాసాలు, అడపా దడపా సంపాదకీయాలు రాస్తారు. యింకా వ్యవహారాల్లో పాల్గొంటారు. ఆయన చదరంగమూ, టెన్నిసూ ఆడతారు. సైకిల్ తొక్కడం నేర్చుకుం టారు. నాటకాలకూ, పాట కచేరీలకూ వెళతారు. విస్తృతంగా ప్రయాణం చేస్తారు. ఆయన జీవితం ఆనందమయమయింది. యిద్దరు పిల్లలు 1887 లో కూతురూ, 1890 లో కొడుకూ కలగడంతో ఆయనకు మహాసంతోషం కలుగుతుంది.

ఆయనకు దుఃఖాలు లేకపోలేదు. ఆయనకు ఆరోగ్యం తరచు చెడి పోతుంది. దాంతో చేస్తున్నపని పక్కన పెట్టవలసివస్తుంది. కానీ కాస్తా షుమారుగావుందా, ఆగిపోయిన పనిని మళ్లీమళ్లీ చేపడతారు. ఆయనకు పని దైవారాధన. అంతకంటే యెక్కువే కూడా. యెందుకంటే, "పని దాని పాటి కదే పరమగమ్యం'' అని ఆయన భావం. నోటు పుస్తకాల్లోని ఆయన మాటలే యివి :

"నాకు పనిమీద గొప్ప విశ్వాసంవుంది. యెగుమారుకు బాటను నిర్మిస్తుంది పని. యెవళ్ళ ప్రశంస మనం కోరుతామో, వాళ్ళ మనస్సులో మనమీద నమ్మకం కలిగించే సాధనం పని. సోమరి తనంలోకి దిగజారిపోతూ, జీవితంలో ముందుకు పోలేనందుకు యేడ్చేవాళ్ల మీద నాకు సానుభూతిలేదు.—నాకు పని ఒక అలవాటు. దానిపాటి కదే పరమ గమ్యం".

తనెంతో ప్రేమించిన తమ్ముడు శ్యామలరావు హఠాన్మరణం ఆయనకు యింకా యెక్కువ దుఃఖం కలిగించింది. అప్పారావుకన్నా వయసుకు మించిన తెలివిపరుడయిన శ్యామలరావు, విద్యార్థిగా తను సాధించిన ప్రశంసనీయమైన విజయాల ద్వారా గొప్ప ఆశలు రేపుతాడు. పండ్రెండవ యేటనే అతను కవిత్వం రాయడం మొదలు పెడతాడు, పిన్న వయసులోనే అనర్ఘలమైన వక్తగా గుర్తింపు పొందుతాడు. 1887 లో మద్రాసులో భారత జాతీయ కాంగ్రెస్ మూడో మహాసభ జరిగిన తర్వాత అతడు 'ది హిందూ' పత్రికలో 'లైన్స్ టు ఆలన్ హ్యూమ్' 'గ్రీటింగ్స్ టు నార్టన్ అండ్ బెనర్జీ' అనే రచనలు ప్రచురిస్తాడు. అవి చిన్ని సంచలనాన్ని కల్గిస్తాయి. కానీ శంభు చంద్ర ముఖర్జీ అభిప్రాయంలో యీ రెండు గేయాలు కానీ, శ్యామలరావు యితర రచనలుగానీ పెద్ద విలువైనవి కావు. తన అభిప్రాయం కోరినప్పుడు శ్యామలరావుకు ముఖర్జీ నిర్మోహమాటంగా చెబుతారు: "నీరచనలు-నాకు పంపిన రచనలు నేను చదివినమేరకు, కవిత్వం కావు. అవి మంచి పద్యాలు కూడా కావు. ఒకోసారి పద్యాలేకావు' శ్యామలరావు అంతంత మాత్రం కవే అయినా పౌరవ్యక్తిగా రాణించి వుండవచ్చు. కానీ, మద్రాసులో లా కాలేజీలో చదువుతూవున్న సమయంలో జబ్బుపడి యిరవై అయిదోయేడు వచ్చి రాక ముందే 1892 లో మరణిస్తాడు. అతని మరణం అప్పారావుగారికి యెంత ప్రచండమయిన అదురుపాటు కలిగిస్తుందంటే కొన్ని నెలలపాటు ఆయన యెందుకూ పనికి రాకుండా పోతారు.

యితర విషాదాలూ, దుఃఖాలూ పేరుకుంటాయి. తన పోషణకింద వున్న పెద్ద బావ మరిది చెడుమార్గాలు పడతాడు. అతను తాగుడుకు అలవాటుపడి, వేశ్యను వుంచుకొని, పోలీసులతో యిబ్బందిపడి, ఆత్మహత్య చేసుకొంటాడు. కుటుంబ గౌరవానికి ఆ భ్రష్టునివల్ల కలిగిన తీవ్రమైన అఘాతంతో ఆతని తల్లి దండ్రులు అకాల మరణం పొందుతారు.

1892 కూ 1897 కూ మధ్య యీ ముసురుతున్న చీకట్లలో అప్పారావు కున్న రెండే రెండు కాంతి రేఖలు, ఆనంద గజపతిపట్ల పెరుగుతున్న ఆయన అనుబంధమూ, తన అత్యుత్తమ రచన అయిన 'కన్యాశుల్కం' రాయడమూ, ప్రదర్శించడమూ, ప్రచురించడమూ. యీ ఘటనలు ఆయన జీవితంలో అసాధారణమయిన ప్రాముఖ్యం గలవి కాబట్టి వాటికి ప్రత్యేక ప్రకరణాలు అవసరం.

# 5. నే నిచ్చానంటే ఆత్మార్పణమే చేసుకుంటా

"ఇదిగో గమనించండి, నేను వుపన్యాసాలివ్వను, ముష్టి యివ్వను; నేనిచ్చానంటే నన్ను నేనే అర్పించుకొంటా"

—వాల్ట్ విట్‌మన్

మొదట చాలా అయిష్టంగా, తర్వాత కాస్తా వెనుకాడుతూ, ఆ తర్వాత ధారాళంగా, అరమరలు లేకుండా, అప్పారావు ఆనంద గజపతికి తన్ను తాను అర్పించుకున్నాడు. ప్రపంచమంతటికీ, మొత్తంమీద, ఆనంద గజపతి 'మోహన రాకుమారుడు', ఆయనకు అన్నీ వున్నాయి. అభిజాత్యమూ, ఆకట్టు కొనే మూర్తీ, ఠీవీ, విస్తారమయిన సంస్కృతీ టెన్నిస్‌లో, క్రికెట్‌లో మంచి ఆటగాడు; సంగీతంలో, చిత్రలేఖనంలో కుశలురు. గుర్రపుస్వారీలో మేటి. ఆయన చెప్పుకోదగిన బహుభాషావేత్త - మాతృభాష అయిన తెలుగు గాక, సంస్కృతం, పార్శీ, ఉర్దూ, అరబిక్, ఇంగ్లీషులాంటి వీడెనిమిది భాషల్లో ఆయనకు ప్రావీణ్యముంది. వంగభాషకూడా బాగావచ్చు. బహు భాషావేత్త మామూలుగా చేసేటట్లే, ఆయన వ్యాకరణాన్ని ప్రత్యేక శ్రద్ధతో అధ్యయనం చేశారు. నిజానికి, ఆయన తెలుగులోకి అనువదించిన సంస్కృత గ్రంథాల్లో ఒకటి 'లఘు కౌముది' అనే ఒక వ్యాకరణ గ్రంథం. సంస్కృతాన్ని పోషించడానికి ఆయన 'విజయనగరం సంస్కృత గ్రంథమాల' స్థాపించారు. దాని ప్రధాన లక్ష్యం అలభ్యమైన సంస్కృత గ్రంథాలను చౌకగా పునర్ముద్రించడం.

ఆనంద గజపతి ఆసక్తులు భాషావిజ్ఞానానికి పరిమితం కాలేదు. ఆయనకు సాహిత్యంమీద ప్రీతి. అది ప్రాచీనమయినా సరే, ఆధునికమయినా సరే. సాహిత్యశాఖల్లో ఆయనకు ఎక్కువగా ప్రీతిపాత్రమైనవి కవిత్వం, నాటకం. ఉర్దూ, పార్సీ కవిగా రాణించాలని ఆయన ఆశించారు; కానీ సాధించిందల్లా 'రషీది' అనే కలం పేరుతో రాసిన సద్గుణరహితమూ అసంపూర్ణమూ అయిన కొద్దిపాటి రచనలు. ముసుగు లేకుండా చెప్పాలంటే, కవిత్వం గురించి ఆయన భావాలు కాస్తా పురాతనమైనవీ, మొరటువీ. ఆయన "గాఢంగా మెచ్చుకున్నది వూహాప్రధానమూ, వుపేక్షాపూరితమూ అయిన ప్రేమ కవిత్వమూ, మధువు కవిత్వమూ."* అంతేకాక, మొత్తంమీద ఆయన "సాహిత్య అంచనా"లలో సర్వవిషయ సమాదరణ లేదు. మేధా శక్తిని చాటే రచనలు ఆయనకు మహా యిష్టం.

ఆనంద గజపతి అధ్యయనం చేసిన భిన్నవిషయాల్లో తర్కమూ, తత్వశాస్త్రమూ, కూడా వున్నాయి. తత్వవేత్తలలోకెల్లా జె. ఎస్. మిల్ "అతనికి బాగా నచ్చిన వాడు" స్తన శల్యపరీక్షచేసే ఖండితమైన తర్కమూ, తత్వశాస్త్రమూ ఆయనకు మహా యిష్టం కాబట్టి. కానీ, మిల్ జీవితంలో, చింతనలో వుండే అంతరార్థాలన్నీ ఆయన సంపూర్ణంగా గ్రహించి వుండ బోలరు.

కళా, సాహిత్యాభిమానిగా పేరుప్రతిష్ఠలున్న సంస్థానాధీశునికి తగి నట్లుగా ఆనంద గజపతి, ప్రజ్ఞావంతులైన కవిపండిత కళాకారుల బృందాన్ని విజయనగరంలో తమచుట్టూ చేర్చుకున్నారు. వాళ్ళలో మరీ ప్రసిద్ధులు సంస్కృత పండితుడైన కాశీనాథశాస్త్రీ, కవీ, భాగవతారూ అయిన నారాయణ దాసూ, వైణిక విద్వాంసుడైన వెంకటరమణ దాసూ. యిక పోతే వేశ్యలను కూడా - యేరి తెచ్చిన కొంతమందిని - ఆయన పోషించాడనుకోండి. బహుశా భారతదేశంలో యే సంస్థానంలో కూడా లేనంత సమ్మోహన కరమైన వాళ్ళను. యీ ప్రకరణం లోనే తర్వాత వాళ్ళ విషయానికి మనం రావలసి వుంటుంది.

---

* మరొక విధంగా చెబితే తప్ప, యీ ప్రకరణంలోని వుల్లేఖన చిహ్నాలమధ్య వుండే భాగాలు ఆంగ్లంలో వుండీ యిప్పటికి అప్రచురితంగా వున్న అప్పారావు డైరీలోనివీ, నోటుపుస్తకాలోనివీ.

ఆనంద గజపతి పేరు దానధర్మాలకు దాదాపు మారుపేరు - రాజ వంశీకుల్లో కూడా అరుదైన ఔదార్యంతో ఆయన పాత్రులైన వ్యక్తులకు సాయం చేశారు. సంస్థలకు యింకా యెక్కువకూడా చేశారు. ఆనంద గజపతి వుదాత్త వ్యక్తిత్వంలోని యీ అంశానికి సురేంద్రనాథ బెనర్జీ "రూపొందుతున్న జాతి" అనే తన ఆత్మకథలో దాదాపు మూడు పుటలు కేటాయించారు. బెనర్జీ యిలా అంటారు: "భూకోయిలాస్ రాజాలు ఆయన అనువంశిక మిత్రులు. వాళ్లు డబ్బు యిబ్బందుల్లో వున్నారు. వాళ్లకు ఆయన గణనీయమైన ఆర్థిక సహాయం చేశారు. ఒక ఆంగ్ల వ్యాపార సంస్థకు కూడా ఆయన అలాగే సాయంచేశారు. ఆయన వుదారమైన అభిమానాలకు జాతీ, రంగూ, మతమూ అడ్డురాలేదు. మద్రాసులోగానీ, బెంగాల్‌లోగానీ, సంయుక్త రాష్ట్రాల్లో కానీ, ప్రజాహిత వుద్యమాలకూ, సంస్థలకూ ఆయన వుదార పోషకులు. నిజానికి ఆయన యెంతవుదారుడంటే, కలకత్తాలోని యిండియన్ అసోసియేషన్ భవ నిర్మాణ నిధికి ఆయన రెండువేల రూపాయలు విరాళం యివ్వవచ్చునని సురేంద్రనాథ బెనర్జీ ఆశిస్తే, ఆయన 15,000 రూపాయలు యిచ్చారు. అది భవన నిర్మాణానికి అయ్యే మొత్తం ఖర్చులో మూడొంతులు. మాక్స్‌ముల్లర్ 'రుగ్వేదం' పరిష్కరింపబడిన రెండు కూర్పు ప్రచురణకోసం మొత్తం ఖర్చు ఆయనే యిచ్చారు. మన ప్రాంతందాకా వస్తే 'ది హిందూ' దినపత్రిక తొలి నాళ్ల గడ్డుకాలంలో ఆర్థిక సహాయం అవసర మయినప్పుడల్లా ఆయన మీద ఆధారపడేది. లౌకికం తెలిసిన వాడూ, మహాసంపన్నుడూ అయిన తమ తండ్రి మూడవ విజయ రామ గజపతి అనంతరం, 1871 లో మహారాజు అయిన ఆనంద గజపతి, అప్పుల్లో తలమునకలు కావడానికి యెంతో కాలం పట్టలేదు. "మాకు తలకుమించిన అప్పులున్నాయి. నీకులేవు" అని మహా రాజావారు తనతో అన్నది ఒక్కసారి కాదని అప్పారావు రాసుకున్నారు. ఆ మాటపై వ్యాఖ్యానంగా "నేను కటిక దరిద్రుణ్ణని మహారాజావారికి తెలి యదు". అని అయన నోటుపుస్తకాల్లో రాసుకున్నప్పుడు, ఆయన ముఖం యెలా ముడుచుకు పోయి వుంటుందో మనం సులభంగా వూహించుకోవచ్చు.

భారతదేశంలోని చిన్నా పెద్దా సాధారణ సంస్థానాధిపతులతో పోలిస్తే ఆనంద గజపతి గౌరవార్హులు. అయినా, తమ వర్గానికుండే బలహీనతలలో కొన్నిటినుండి అయన పూర్తిగా దూరం కాలేదు. ఆయనకు "చిన్నప్పటి సంపర్కాలవల్లా, ఆశ్రితుల ముఖస్తుతుల వల్లా సంగీతం, గుర్రపుస్వారీలాంటి

ఒకటి రెండు విద్యల్లో కలిగిన నైపుణ్యంతో బలపడిన యితరులను మించి పోవాలనే తపనవల్లా వర్ధిల్లిన సహజమైన అహంకారం'' వుండేది.

ఆయనకు మరొక 'తపన' సయితం వుండేది. అది తన జమీందారీకి రాజసంస్థాన స్థాయి సంపాదించు కోవాలనేది. బ్రిటిషు కాలంలో భారత దేశంలో 585 రాజసంస్థానా లుండేవి. అవి ఒకవైపున (1931 జనాభా లెక్కల ప్రకారం) పద్నాలుగు మిలియన్ల జనాభాతో పరచుకొని వున్న హైదరాబాదు మొదలుకొని, మరోవైపు 29 మంది జీవులు మాత్రమేవున్న నలుసులాంటి బిల్బరీ వరకూ వున్నాయి. వాటిని "రాజ్యాలు'' అనడం అసంబద్ధం. లీ వార్నర్ "భారతదేశ రక్షిత రాజులు అనే గ్రంథంలో యిలా రాశారు. "భారత దేశాంతర్భాగంలోని యే సంస్థానానికీ, యింటా బయటా సంపూర్ణ సర్వసత్తాక లక్షణాలు లేవు. యెందుకంటె దేనికీ యుద్ధం ప్రకటించడానికైనా, శాంతిప్రకటించడానికైనా, అధికారం లేదు. యితర సంస్థానాలలో సంప్ర దింపులు జరిపే హక్కు-లేదు''.... అంతరంగిక పరిపాలనలో సయితం, కీలక విషయా లన్నిటిలోనూ బ్రిటిషు రెసిడెంటుదే చివరిమాట. నిజానికి క్రియలో అతనే సర్వాధికారి. కొచ్చిన్ చిన్న సంస్థానం కాదు. కానీ బ్రిటిషు రెసిడెంటు కర్నల్ మెకాలె సామ్రాజ్యవాద దురహంకారంతో కొచ్చిన్ పరిపాలకునికి వర్తమానం యిలా పంపగలిగాడు: "రెసిడెంట్ కొచ్చిన్ దగ్గరకు వచ్చినప్పుడు కొచ్చిన్ రాజా ఆయనను దర్శనం చేసుకొనే వీలుచేసుకుంటాడని తెలిస్తే రెసిడెంట్ సంతోషిస్తారు''.

ఆనంద గజపతికి యివన్నీ తెలుసు. యింకా యెక్కువే తెలుసు. అయినా, వంశగర్వం మూలంగా ఆయన సంస్థాన స్థాయిని పొందేందుకు తమ జమీందారీకి వుండే హక్కుల్ని నిరూపించే నిమిత్తం ఎన్నోయేళ్లు, యెంతో డబ్బు వ్యర్థం చేశారు. పురాణాలలోని సూర్యవంశ స్థాపకుని నుండీ తన దాకా తమ వంశ వృక్షాన్ని నిరూపించే వ్యర్థ ప్రయత్నంలో ఆయన "కృష్ణ విజయము''"ఉషాభ్యుదయము' 'విష్ణుభక్తి సుధాకరము' అనే మధ్యయుగాల వుత్తరార్థానికి చెందిన ప్రబంధాల నుండీ రాజవంశ వృక్షాలను తెలియచేసే పద్యాలు యేరడానికి పండితులను నియమించారు. ఈస్టిండియా కంపెనీనాటి దుమ్ము పట్టిన పాతరికార్డులను ఆయన స్వయంగా తవ్వి 'సంధి' అనే బృహ ద్గ్రంథాన్ని తయారు చేశారు. 1794లో పద్మనాభ యుద్ధంలో రెండవ విజయ

రామ గజపతి మరణించాక, ఆ మృతవీరుని కొడుకుకూ, మనమనికీ బ్రిటిషు వాళ్లు అన్యాయం చేసి, క్రమక్రమంగా వాళ్ల భూభాగాన్నీ, బిరుదలనూ తగ్గించివేశారని ఆ బృహత్గ్రంథంలో ఆయన రుజువు పరచడానికి ప్రయత్నించారు. తమవాదాన్ని యింకా బలపరచుకొనేందుకు ఆయన విజయనగర వంశచరిత్ర రాయడానికి ఒక పథకం ప్రారంభించారు. అనారోగ్యం దృష్ట్యా, దుర్బలమవుతున్న కంఠం దృష్ట్యా, లెక్చరర్ వుద్యోగం మానుకోమని, 1896లో డాక్టర్లు అప్పారావుకు సలహా యిచ్చారు. దాంతో ఆనంద గజపతి ఆయనను సంస్థాన శాసన పరిశోధకుడుగా నియమించి, ఆ చరిత్రకోసం సమాచారం సేకరించే పనేకాక, దాన్ని రాసేపనికూడా ఆయనకే అప్పగించారు. అది సులభమైన బాధ్యత యేమీకాదు. కానీ కార్యరంగంలో, పనిలో మార్పు వచ్చినందుకు, సంతోషిస్తూ అప్పారావు ప్రత్యేకంగా విజయనగర చరిత్రకూ, మొత్తం మీద కళింగ చరిత్రకూ కొంత సంబంధంవుండే పాత శాసనాల ప్రతులూ తీసుకోడానికి మద్రాసు, బెంగుళూరు, బెజవాడ, గుంటూరు, శ్రీకాకులం, ఛత్రపూర్ మొదలైన చోట్లకు ప్రయాణాలు చేశారు. శాసన ప్రతులే కాక, కర్నల్ మెకంజీచేత సేకరింపబడి, మద్రాసు ప్రాచ్య లిఖితపత్ర భాండాగారంలో భద్రపరచబడిన స్థానిక చరిత్రలనుండీ తనపనికి సంబంధించిన సమాచారం కూడా ఆయన సమకూర్చు కున్నారు. ఆ చరిత్రరచన ఆరంభించడానికి తగినంత సమాచారం రెండేళ్లలో సమకూరింది. కానీ, ఈలోగా మహారాజావారు ఒక దుర్ఘటనలో మరణించారు. అంటే ఆ పథకం శాశ్వతంగా వదలి వేయడంకాదు, అనుకున్నా అది నిరవధికంగా వాయిదాపడింది.

తాను కేవలం హిజ్ హైనెస్ అని పిలుచుకోవడానికో, ఫిరంగుల వందనం అందుకోవడానికోగాక, తన ప్రాచీన రాజవంశ ప్రతిష్ఠను పునరుద్ధరించుకోడానికి న్యాయమైన పోరాటం చేస్తున్నట్లు, ఆనందగజపతి భావించిన మాట నిజమే. కానీ, అప్పారావు మనఃప్రవృత్తినిబట్టి చూస్తే, మహారాజావారు నిజంగా అంతవిలువలేని దానికోసం ఆపేక్షిస్తున్నట్లు ఆయనకు అనిపించి వుండాలి. అయితే ఈ విషయంలో మహారాజువారి తపన స్వచ్ఛమైందని ఆయన అంగీకరించారు. మహారాజా వారిమరణం తర్వాత, ఆయన తన నోటుపుస్తకాల్లో రాసుకున్నది యిది :

> "రాజువంశ గతచరిత్రను సింహావలోకనం చేస్తే, ఆయనరక్తనాళాల్లో యోధులవంశరక్తం ప్రవహిస్తోంది. ఆవేశాలను అణచివేసే

పాశ్చాత్య సంస్కృతి ప్రభావమూ, తత్వశాస్త్ర ప్రభావమూ ఆయన మీదవున్నా, అనుభూతులను అధిగమించే నిమిత్తం ఆయన పొందిన శిక్షణప్రభావం కూడా వున్నా, ఆయన తీవ్ర స్వభావుడు. అలాంటి మహారాజావారు యీ ప్రాంతాల్లో యెవరి అధికారస్థాపన విషయంలో తమ పూర్వికులు భౌతికంగా సహాయంచేశారో, వారు తనను యీ స్థితికి దించినందుకు, బాధపడకుండా వుండలేరు. ప్రత్యేక హక్కులు కావాలని అడిగేందుకు ఆయనకు అభిమానం అడ్డువచ్చింది. ప్రభుత్వో ద్యోగులతో ఆయన హేతుపూర్వకంగా పోరాడుతూ వచ్చారు. వాళ్ళేమో ఆయన వాదాలను నిరాధారమైనవిగా పరిగణించి, నిర్దాక్షి ణ్యంగా ఆయనను అణగదొక్కిపెట్టారు. తనభావాలను ముందుంచ డంలో అనుచితంగా ప్రవర్తించినట్లు గానీ, అసంతృప్తి వెల్లడించినట్లు గానీ తనమీదకు ఆరోపణరాకుండా, తన విధేయతను ఆయన సమృద్ధిగా ప్రకటించారు. యేమైనా అది స్వచ్ఛమైన అనుభూతి; ఆయన స్వభావంలో అంతర్నిహితమైన రుజుత్వాన్నిబట్టి చూస్తే, దాన్ని సందేహించేందుకు అవకాశమే లేదు.''

ఆనందగజపతి బలహీనతల్లో, అనాలోచిత వ్యవహారాల్లో అప్పా రావును నిజంగా బాధించింది, రామస్వామితో † ఆయన సంబంధం. మహా రాజావారి అంతస్తుకు చిహ్నంగా వారికొలువులో మనోజ్ఞ వేశ్యాబృంద వున్నట్లు అప్పారావుకు తెలుసుననడంలో సందేహంలేదు కానీ వాళ్ళు మహారాజావారి సుఖంకోసంకాక, వాళ్ళ అతిథుల సుఖంకోసంఅని ఆయన అనుకున్నారు. విజయనగరంలో 1897 జనవరి 2వ తేదీ తన డైరీలో ''మహారాజా హోల్కార్ ఆగమం'' అని ఆయన రాసుకున్నారు. మూడు రోజుల తర్వాత ''హోల్కార్ మహారాజా రాజభవనం నుండీ ముగ్గురు వేశ్యల్ని తీసుకువెళ్ళి, వాళ్ళను గోదావరి (రైల్వేస్టేషన్) నుంచీ వెనక్కి పంపారు'' అని డైరీలోవుంది. 29 తేదీనాడు ''ఆ దేవకాంతలకోసం మహా రాజా హోల్కార్ తంతి యిచ్చారు'' అని మూడవ ఆరోపం. యితర సంస్థానాధీశ్వరులకంటే కొట్టవచ్చినంత తేడాలో తమ మహారాజువారు ''అద్భుతమైన ఆత్మనిగ్రహం'' గల ఆదర్శ సద్గుణ సంపన్నులని అప్పారావు విశ్వసించారు. మహారాజావారు ఒకమారు అప్పారావుతో ''ధర్మపత్నితో

† యిది మగపేరులాగా వున్నా, వాస్తవంగా ఆడపేరే.

తప్ప యితరులతో కామ వ్యాపారం యెప్పుడో వదిలా''నని చెప్పడంతో ఆ విశ్వాసం బలపడింది. అది నిజంకాదని రుజువైనప్పుడు మహారాజావారిని గురించి చాలా యేళ్ళుగా అప్పారాజు తనమనస్సులో నిర్మించుకొన్న అద్భుత చిత్రం వెయ్యి ముక్కలయింది.

ఆనందగజపతి భార్య వనజకుమారీదేవి జయపురం రాజకుటుంబానికి దగ్గర బంధువు. ఆనంద గజపతితో ఆమె వైవాహికజీవితం పరమ సంతోషమయంగా వుండింది. కానీ, అది అతి శీఘ్రంగా, అతి ఆకస్మికంగా ముగిసింది. ఆమె 1896 లో నిస్సంతుగా మరణించారు. ఆ క్రూరమైన దెబ్బతో ఆనందగజపతి జీవితం పెడదోవ పడుతుంది. అప్పటి నుంచీ, చాలా మంది స్త్రీలు ఆయన జీవితంలో ప్రవేశిస్తారు. వాళ్లలో ఒకామె "అప్. యస్'' తాను ప్రేమించే భార్యతో పోలిక గల యువతి కన్పిస్తే ఆమెమీద యిష్టం మొదలౌతుంది. అని అప్పారావు అంటారు. యింక, రెండో ఆమె నారాయణ స్వామి, మూడో ఆమె వెంకటస్వామి. యింకా కొందరు 'స్వాములు' వుండివుండవచ్చు. యేమైనా, యిదిమాత్రం నిశ్చయం. ఆనంద గజపతిని అందరికన్నా యెక్కువగా మోహ వివశుని చేసిన వ్యక్తి రామస్వామి. నిజానికి ఆయన ఆమె పట్ల యెంత మోహ వివశుడయ్యారంటే, ఆమెను పెళ్లి చేసుకునేందుకు నిశ్చయించు కున్నారు.

ఆనంద గజపతి స్త్రీలో కోరింది నాజూకుతనంతో కూడిన సౌందర్యమూ, సుసంస్కృత బుద్ధితో కూడిన సాహచర్యమూ. అప్పారావు రాసి పెట్టుకున్న సూక్తుల్లో ఒకటి, "అందం బలప్రయోగం చేయని రాజు''. మరొకటి హెచ్చరిస్తుంది కదా: "అందం తొందరగా కంటికి పాతబడిపోతుంది. సౌశీల్యానికి మాత్రమే యెప్పుడూ నశించని ఆకర్షణ వుంది.'' మూడోది యిలా వుద్ఘాటిస్తున్నది: "స్త్రీ శరీరాన్ని పొందడంలోగానీ, సొంతం చేసుకోడంలోగానీ, గొప్పదనం లేదు, యెవళ్ళయినా మనస్సును పొందాలి.'' అలాంటి అభిరుచులూ, విశ్వాసాలూ గలవారు కాబట్టి, ఆనంద గజపతి రామస్వామికీ, వెంకటస్వామికీ శిక్షణ యిచ్చే బాధ్యతను తానే తీసుకున్నారు. కానీ త్వరలోనే "అతనికి తన బాధను అమలు పరచడంలో అశ్రద్ధా వాటికి అనుగుణంగా నడచుకోడంలో నిరంతర వైఫల్యాలు యెదురైనప్పుడు, ఆశావాది అయిన ఉపాధ్యాయునికికలిగే ఆత్రమూ అసహ్యమూ కలగడం మొదలైనట్లు కని

పిస్తుంది. ఈ "అత్రమూ, అసహ్యమూ—బహుశా వీటి మూలంగానే ఆయన రామస్వామిని అప్పారావు గురుత్వంకింద ఉంచారు. ఆ పని చేసేటప్పుడు ఆయన "మా అమ్మగారికీ, మా అక్కగారికి మీమీద అంచంచలమైన విశ్వాసం ఉంది" అని చెప్పారు. అప్పారావును సంకట పరిస్థితిలో పెడుతున్నట్లు ఆయనకు తెలుసు. అందువల్ల ఆయన మళ్ళీ యిలా అన్నారు:

"మీకు నేను చాలా రుణపడి వున్నాను. నా కండలుకోసి యిచ్చినా ఆ రుణం తీరదు. వుదాత్తమైన ఆశయాలనూ వుద్దేశాలనూ లోకం గ్రహించదు. ఆయన ఆ పిల్లను ప్రేమిస్తున్నాడు, కాబట్టి ఆమె దగ్గరకు పోతున్నాడనో, ఆమె ద్వారా స్వలాభం పొంద గోరు తున్నాడనో, రాజావారి అనుగ్రహం సంపాదించ గోరు తున్నాడనో అనగల అజ్ఞానులూ, మూర్ఖులూ చేసే దుర్వ్యాఖ్యానాలకు గురి అవుతూ మీరు అధైర్యపడలేదు."

యీ కొత్త పరిస్థితికి అప్పారావు యెలా ప్రతిస్పందించారు? యీ విషయంపై మనం వూహించవలసిన అవసరంలేదు. ఆయనే తన నోటుపుస్తకాల్లోని ఒక సుదీర్ఘ ఆరోపంలో తన సంక్షుభిత మనస్సును స్పష్టంగా మనకు వివరిస్తారు. దానిలోని మరీ ముఖ్యమైన కొద్ది భాగాలు యివి:

"నేను రామస్వామి బాధ్యత చూస్తున్నాను. కొద్ది సంవత్సరాల కాలం, నా అభిప్రాయాల్లో యెంత మార్పు తెచ్చింది! మహారాజావారు మొదట రామస్వామిని తెచ్చుకున్నప్పుడు, ఆ విషయం విని నేనెంతో విచారపడ్డాను. మహారాజావారి గత జీవితం గురించి నా కుండే అభిప్రాయాన్ని బట్టి అలాటి విషయం జరుగుతుందని నేను వూహించలేదు. అయితే ఆయన పూర్వజీవితం గురించి నాకు తెలిసింది చాలా తక్కువ. కాబట్టి అది నాకు విచారకరమైన ఆశ్చర్యంగా, గొప్ప ఆశ్చర్యంగా వుండింది. నేనుచాలా బాధపడ్డానని చెబితేచాలు-అంత మంచితనమూ, సామర్థ్యమూ, గొప్ప భవిష్యత్తూవుండే మా మహారాజావారు ఒక్క దెబ్బతో తమ అవకాశాలన్నిటినీ పేల్చివేసినందుకు నా స్వాభిమానం దెబ్బతింది.....తర్వాత తర్వాత వార్తలద్వారా కొన్ని ఘటనలు నాకు తెలిసినప్పుడు, అవి పాతబడ్డ విషయాలుగా నాకు అనిపించ లేదు,

తద్భిన్నంగా నాదుఃఖం పెరిగింది. —తర్వాత నాకు మహారాజా వారితో మరింత సన్నిహిత పరిచయం కలిగింది. రామస్వామితో కూడా నా పరిచయం పెరిగింది. రామస్వామిలోని మంచి గుణాలు గ్రహించాను. కానీ, చెడ్డగుణాలు అంతకంటే యెక్కువగా వున్నాయి. చివరకు ఆమె బాధ్యత నాకు అప్పగించ బడింది. లేదా, అలా జరుగుతుందని వూహించి, ముందుగా నేనే ఆమె బాధ్యతను తీసుకొన్నానని అనవచ్చు. నా అభిప్రాయాల్లో మరొక మలుపు. గత ఆరేళ్ళలో నా పర్యాలోచనా శక్తి, జీవిత పరిజ్ఞానమూ పెరిగాయి. అయిష్టమూ, ద్వేషమూ దురభిప్రాయమూ వగైరాలను అణచుకోవడమూ, సానుభూతి చూపడమూ నేర్చుకొన్నాను. సానుభూతి అనేది సాహిత్య జీవికి విధిగా వుండవలసిన గుణం.”

అప్పారావు జాజ్వలమానమైన సానుభూతిని కూడా రామస్వామి తరచుగా బెదరగొట్టేది. అయితే, ఆనందగజపతిపట్ల ఆయన ప్రేమ, విధేయతలు యెలాంటివంటే, వాల్ట్ విట్మన్ లాగే ఆయన కూడా యిలా అని వుండవచ్చు:

“నే నిచ్చానంటే ఆత్మార్పణమే చేసుకుంటా”

# 6. నూత నాగంతకుడు

“వుల్లాస నూత నాగంతకుడా! విన్నాను
నీ వాక్కు విన్నాను, ఆనందపడ్డాను”

—వర్డ్స్ వర్త్

యెప్పుడో ఒకసారి అప్పారావు నాటక కర్తగా ఆవిర్భవించేవారే. ఆయన ప్రతిభలో నాటకీయ స్వభావం బలంగా వుండేది. ఆంగ్లంలో కవిత్వం రాయడానికి ఆయన చేసిన మొదటి ప్రముఖ ప్రయత్నం ‘సారంగధర’. దాని యితివృత్తమూ, సన్నివేశ కల్పనా-రెండూ నాటకీయంగా వున్నాయి. ఆయన కవితల్లో రెండు మూడు ఛందోబద్ధమైన నాటకీయ దృశ్యాలు, ఆయన

కథలన్నిటికి నాటకీయమైన ప్రారంభాలూ, ముగింపులూ వున్నాయి. యిక ఆయన డైరీల్లోనూ, నోటుపుస్తకాల్లోనూ, యితర సంగతులతో పాటు నాటకాలకోసం దృశ్యవివరాలూ, యేదో ఒకరోజు తన నాటకాల్లో పాత్రలుగా ప్రవేశించ గలిగిన స్త్రీ పురుషుల వర్ణనలూ, హాస్యపూరిత సన్నివేశాలమీద సంక్షిప్తంగా రాసుకున్న వివరాలూ, నటులమీదా, నటనమీదా, నాటకకర్తల మీదా, నాటకదర్శకుల మీదా, వ్యాఖ్యానాలూ వున్నాయి. నోటుపుస్తకాల్లో అలాంటి ఆరోపాలన్నిటికి 'ఎం. ఒ'† అనేగుర్తుంది. †† అంటే నా సొంత ఆలోచనలూ, అభిప్రాయాలూ, వ్యాఖ్యలూ అని అర్థం, అనే వివరణ గుర్తుపక్క ఉంది. జాగరూకమైన ఆయన కంటినీ, అప్రమత్తమైన మనస్సునూ యేదీ తప్పించుకోలేదు. 'మానసికమైన యిబ్బంది' అనే శీర్షికకింద ఆయన రాసుకున్న అభిప్రాయాలు యివి :

> "అపరాధ భావంవల్లనో, తక్కువస్థాయి వల్లనో, భయం వల్లనో, యెదుటి వ్యక్తిమీద గౌరవం వల్లనో సంభాషణ సమయంలో మనుషులకు ఆత్మవిశ్వాసం లేనప్పుడు పెన్సిలు, పేనారాంటి యేదో ఒక వస్తువునుచేతబట్టునికొ వాళ్ళు అటూయిటూ ఆడిస్తారు.(దానివల్లవాళ్లకు ఆలోచించుకోడానికి, భయంకలిగించే పనినుంచీ, తమమెదడుచెప్పే ప్రతి కూలాభిప్రాయంనుంచీ తప్పుకోవడానికీ వ్యవధి లభిస్తుంది.
>
> అలాంటి కారణం లేకుండానే-బహుశా ప్రధానంగా ఆత్మవిశ్వాసం లేకపోవడం మూలంగా-కొంతమందికి ముక్కు నలుపుకోవడమూ, వేళ్లు విరుచుకోవడమూ లాంటి సాధారణ స్వభావం ఉంటుంది."

మానవజీవిత విషాద హాస్యనాటకం గురించి మరింత ఖచ్చితమైన అవగాహనవుండే అప్పారావు, హాస్య సన్నివేశాలమీద తన నోటుపుస్తకాల్లో కొద్ది దాఖలాలు రాసుకున్నారు. మూడు రకాల బడాయి మాటలను ఆయన గుర్తిస్తారు : (1) ప్రతివాణ్ణీ, ప్రతిదాన్నీ తేలికగా మాట్లాడడం (2) బడాయిలో మరొకరిని మించిపోవడం (3) తమ పూర్వీకుల గురించి గొప్పలు

† M. O: My Own Reflections, Observations and remarks.

†† ఆనందగజపతిని గురించి వ్రాసిన వాటికి హెచ్. హెచ్ అని గుర్తు వుంది.

(H. H. His highness సంగ్రహరూపం, అను.)

చెప్పుకోవడం. యీ మూడురకాల కింద మాదిరి ఐదాయి మాటలను, పద బంధాలను, వాస్తవ జీవితంనుంచీ ఆయన వుల్లేఖిస్తారు. 'ఎం. ఒ' అనేగుర్తు వుండేవాటిలో అన్నిటికన్నా పెద్దది "భట్రాజుగారి అబ్బాయి స్వభావం గురించి" రాసుకున్నది. అప్పారావు సృష్టించిన అత్యంత ప్రసిద్ధమైన పాత్రల్లో ఒకరైన గిరీశం, యీ 'భట్రాజుగారి అబ్బాయి' యొక్క మరింత జీవవంతమైన, మరింత లజ్జారహితమైన, మరింత ఆకర్షణీయమైన కవల సోదరుడే అని గుర్తించడానికి మన వూహాశక్తిని శ్రమ పెట్టనక్కరలేదు.

అప్పారావు సాహిత్యాధ్యయనంలో కూడా అదే శ్రద్ధ, అదే ఉత్సాహమూ వున్నాయి. ఆయన సాహిత్యాన్ని చదువుకునేది విజయనగరం మహారాజా కళాశాలలో ఆంగ్లోపన్యాసకులైనందువల్లనే కాదు. దానికి ఆయనకు స్వయంగా ఆసక్తి-వ్యామోహం అనదగినంత ఆసక్తి-వున్నందువల్ల కూడా. నిజానికి 1896లో కళాశాలలో వుద్యోగంవదలి పెట్టాక ఆయన సాహిత్యాన్ని మరింత శ్రద్ధగా అధ్యయనం చేస్తారు. మద్రాసులో మహారాజావారి రాజ భవనం అడ్మిరాల్టీలో ఆయన తరచు, చాలారోజుల తరబడి వుండేవారు. అనారోగ్యం నుంచీ కోలుకోడానికీ, కొంతవరకు విజయ నగర రాజ చరిత్ర మీద పరిశోధన చేయడానికీ ఆయన అలా వుండేవారు. అక్కడ గుట్టలు గుట్టలు పుస్తకాలూ, పత్రికలూ ఆయనకు అందుబాటులో వుండేవి. ఆయన ప్రధాన అధ్యయన విషయం చరిత్ర అనీ, తర్వాతివి నాటకమూ, నాటక రంగస్థలమూ అనీ ఆయన డైరీలలోని ఆరోపాల బట్టి తెలుస్తుంది. ఆ సంవత్సరాల్లో ఆయన చదివిన వాటిలో నాటకాలూ, నాటక విమర్శలూ, నాటకకర్త జీవిత చరిత్రలూ కాకుండా 'విదేశనటులూ, ఆంగ్లనాటకమూ' అనే విషయం మీద 'కార్న్ హిల్ మేగజైన్' లోని వ్యాసాలు-'ఒక నాటకరచయిత బాధలు, 'చైనాలో నాటకరంగం,' 'ఫ్రాన్స్‌లో షేక్స్పియర్', 'ఆహార్యమూ, పాత్రా', 'నాటకాల సెన్సార్‌షిప్', 'మోలియర్‌కు పూర్వం పారిస్ నాటక రంగం', 'షేక్స్‌పియరూ, వోల్టేరూ', 'డెన్మార్కు జాతీయ నాటకరంగం', 'షేక్స్‌పియర్ విషాద నాటకాలు రాసింది యెందుకు? 'ఫాస్టూ తోలుబొమ్మలాట కథానాయకుడూ' వగైరా-వున్నాయి. నాటకం పట్లా, నాటకరంగం పట్లా యింత యిష్టం, యింత వ్యామోహం వుంది కాబట్టి అప్పారావు నాటక కర్తగా ఆవిర్భవించడం ఆశ్చర్యమేమీ కాదు. నిజంగా ఆశ్చర్య పడవలసింది నాటకకర్తగా మొట్ట మొదటి ప్రయత్నంలో ఆయన సాధించిన ఆధునికత,

తెలుగు ఆధునిక నాటక రచయితల్లో అప్పారావు ప్రథములు కారు. అయితే ఆయన కంటే ముందున్న అయిదారు మంది విషయంలో ఆధునికత అనే విశేషణం వాళ్ళ మనసులకంటే, వాళ్ళ కాలానికే యెక్కువ వర్తిస్తుంది. పెద్ద మినహాయింపు వీరేశలింగం (1848-1919). కానీ, ఆయనకు కూడా ఆధునిక తత్వం అప్పారావుకు ఒంట బట్టినంతగా పట్టలేదు. దీనికొక ముఖ్యకారణం వీరేశలింగం గ్రంథ పఠనం అప్పారావు పఠన మంత విస్తృతమూ, వైవిధ్యపూరితమూ కాకపోవడం. ఆ కారణం వల్ల ప్రపంచ భావనలోని సరికొత్త ధోరణులతో, మరింత నిర్దిష్టంగా చెప్పాలంటే, ప్రపంచ నాటకంలో, నాటకరంగంలో వచ్చిన అత్యాధునిక పరిణామాలతో ఆయన పరిచయం అంత సమకాలికం కాక పోవడం కూడా.

అయితే అప్పారావుకు సయితం, తన కాలంతో బాటు నడవాలనే పట్టుదల వున్నా, ఆయన హెన్రిక్ ఇబ్సెన్ (1828-1906), జార్న్ స్టెర్న్ జాన్సన్ (1832-1910), అగస్ట్ స్ట్రిండ్ బెర్గ్ (1849-1912), క్రిస్టియన్ ఫ్రెడరిక్ హెబ్బెల్ (1813-1863), ఒట్టో లుడ్విగ్ (1813-1865), హెర్మన్ సూడర్మన్ (1857-1928), అంతన్ చేహోవ్ (1860-1904) – ఆధునిక నాటకాన్ని సృష్టించిన ప్రముఖ ఐరోపీయ నాటక కర్తలలో యీ యేడుగురినీ గుర్తించ లేక పోయారు. గుర్తించ లేక పోవడానికి కారణం స్పష్టంగానే తెలుస్తోంది. తక్కిన వాళ్ళ సంగతి యెందుకు గానీ, మహోన్నతులైన యీ యేడుగురిలో అగ్రగణ్యుడైన ఇబ్సెన్, విదేశాలలో గుర్తింపు పొందడానికి యెంతో కాలం యెదురు చూడవలసి వచ్చింది. యింగ్లండులో ఆయనను మొదట అలక్ష్యం చేశారు. తర్వాత ద్వేషించారు, యేవగించు కున్నారు, అభిశంసించారు. ఆయన నాటకాలు రాయడం ఆరంభించాక ముప్పైయేళ్ళకు లండన్‌లో ఒక నాటకం ప్రదర్శింప బడింది -- అదికూడా మాటినీగా ఒక్కసారి; అది 1880 లో. ఆయన మరొక నాటకం 1891 లో మాత్రమే ప్రదర్శింపబడింది. ఆ మధ్యకాలంలో ఆయన నాటకాలు ఆంగ్లంలోకి అనూదితమై, ప్రచురితమైన మాట వాస్తవమే. కానీ ప్రతి కొత్తదాని మీదా అంతకు ముందు దానిమీద కంటే విషం గక్కడం జరిగింది; "తన నాటకాలనబడే వాటిలో నిర్మాణం లేకపోవడం అటుంచి, వుద్దేశ పూర్వకంగా మానవ జీవితంలోని మరీ మురికి మూలలనుంచీ, అత్యంత నీచమైన మూలలనుంచీ, చివరకు అత్యంత దుస్పృహమైన మూలలనుంచీ కూడా తన యితివృత్తాలను తీసుకునే

నాటక కర్త'' అంటూ ఇబ్సెన్ ను ఒక విమర్శకుడు దుయ్యబట్టాడు. మరొక విమర్శకుడు ఇబ్సెన్ రాసిన ఒక నాటకాన్ని ''మూతలేని మురుగు కాలవ'' అంటూ యేవగింపుతో కొట్టి పారేశాడు. విలియం ఆర్చర్, బెర్నార్డ్‌షా ప్రభావకంగా యిరవై యేళ్ళపాటు ఇబ్సెన్ ను వెనుక వేసుక వచ్చిన తర్వాతనే యింగ్లండు ఆయనను మహా నాటకకర్తగా గుర్తించింది. జాన్సన్, స్ట్రిండ్ బెర్గ్, చేహోవ్ మొదలైన వాళ్ళకు కూడా యిరవయ్యో శతాబ్ది ప్రారంభం నుంచీ మాత్రమే ప్రపంచ ప్రఖ్యాతి లభించింది.

అప్పారావు 'కన్యాశుల్కం' యెంత ఆధునిక నాటకమంటే వుదాహరణకు ఇబ్సెన్ 'సమాజ స్తంభాలు' అనే నాటకమంత. దీని నిర్మాణం ఇబ్సెన్ నాటక నిర్మాణం అంత తీర్చినట్టుగా, నిపుణంగాలేదు కానీ, దాని ఆధునిక తత్వం దీనికీ ఉంది. 'కన్యాశుల్కం' ప్రధమ ప్రదర్శన కాలం 1892 లో లేదా దానికి ఒకటి రెండేళ్ళు ముందు ఆ నాటకం రాయడానికి గురుజాడకు వుత్తేజమిచ్చింది-ఇబ్సెన్‌గానీ, చేహోవ్‌గానీ మరొక ప్రముఖ నాటక కర్తగాని కాకపోతే మరెవరై వుండవచ్చు? ఆయనకు కావలసిన పూర్తి వుత్తేజం ఆయనలోనే కలిగింది అనే సిద్ధాంతం వాదానికి నిలవదు. అత్యంత మౌలికమైన రచయితలు కూడా యేదో ఒక మేరకు, యెంతకొద్ది మేరకైనా, తమ పూర్వీకులకు తప్పనిసరి ఋణపడి ఉంటారు. అయితే మరి అప్పారావు యెవరికి ఋణపడి ఉండవచ్చు?

ఆల్లార్డిస్ నికోల్ 'పందొమ్మిదో శతాబ్ది చివరిభాగపు నాటక చరిత్ర, 1850-1900' చదివితే, ఆధునిక నాటకకర్తల్లో ఒకరైన విలియంరాబర్ట్‌సన్ (1819-1871) వల్ల అప్పారావు యెంతో ప్రభావితుడైనట్లు మనం గట్టిగా వూహింపవచ్చు. రాబర్ట్‌సన్ ప్రవేశపెట్టిన రెండు ముఖ్యమైన కొత్తరీతులు: ప్రేక్షకులు తమ సొంత విషయాలను నాటకరంగం మధ్యకు తీసుకవెళ్ళేటట్లు చేయడం, అచ్చం ''తమ సొంత యిళ్ళలో వినే భాషలోనే వాటిని తెల్సుకోవడం. అతని ఘనవిజయం 'సమాజం' (1865), అతని అత్యుత్తమ హాస్యనాటకం 'కులం' (1867), ఆంగ్లనాటకం, నాటకరంగం-వీటిపై ప్రామాణికుడైన ఒక రచయిత ప్రకారం 'కులం' రచనద్వారా రాబర్ట్‌సన్ ''ఆధునిక నాటక వైతాళికుడ''య్యాడు.

గురజాడ విజయనగరంలో 'కులం' ప్రదర్శన చూసినట్టు ఆయన 1897 డైరీలోవుంది. ఆ నాటికి చాలాకాలం కిందటే ఆయన ఆ నాటకం చదివి వుండాలి. రాబర్ట్‌సన్ వెనువెంటనే వచ్చిన సర్ విలియం యస్. గిల్బర్ట్ (1836-1911), సర్ ఆర్థర్ పినేరో (1855-1934) హెన్రీ ఆర్థర్‌జోన్స్ (1851-1929) లాంటి వాళ్ళ నాటకాలుకూడా ఆయన వివేచనా పూర్వకంగా చదివి వుండాలి. ఆయన డైరీల్లో వాళ్ళు కన్పిస్తారు.

రాబర్ట్‌సన్ లా అప్పారావు సయితం ఒక సమకాలిక సమస్యను తన యితివృత్తంగా స్వీకరిస్తారు. రాబర్ట్‌సన్ లాగే ఆయనకూడా మనయిళ్ళల్లో మాట్లాడుకునే భాషలాంటి భాషనే వుపయోగిస్తారు. మరొక పోలిక: యిద్దరూ తమ నాటకాల్లో ఆభిజాత్యపు భేషజాల బూటకాన్ని బట్టబయలు చేస్తారు. పుట్టుకనుబట్టి బ్రాహ్మలైన వాళ్ళను అప్పారావు దుయ్యబడితే, రాబర్ట్‌సన్ అంతస్తువల్లా, మనః ప్రవృత్తివల్లా బ్రాహ్మలైన వర్గస్పృహా పూరితులైన ఆంగ్లేయులపై విరుచుకపడతారు. నిశితదృష్టివుండే ఒక రచయిత అన్నట్టు "బ్రాహ్మల్లో సుప్రతిష్ఠితమైన శాసనాల ముసుగులో వుండేదీ,ఘనమైన ఆర్య జాతి అత్యంత పాశ్చాత్య ప్రతినిధుల్లో శాసనాలకంటే తక్కువ శక్తిమంతం కాని దురభిప్రాయంద్వారా యేర్పడిందీ" అయిన సామాజిక అంతస్తులను రాబర్ట్‌సన్ 'కులం' చర్చిస్తుంది.

సంస్కృత నాటకాలు ప్రదర్శించడానికి ఆనందగజపతి స్థాపించిన నాటక సంస్థ 'జగన్నాథ విలాసినీ సభ' 1892లో 'కన్యాశుల్కం' మొదటి సారి ప్రదర్శించింది. ఆ సంస్థ యెప్పుడైనా ఒక పర్యాయం తెలుగు నాటకాలు సయితం ప్రదర్శించిందన్నమాట! తన నాటకం రిహార్సల్సుకు అప్పారావు హాజరయ్యారా? అయివుంటే, నాటకం నిర్మాణం యెంత వదులొదులుగా, అసౌష్ఠవంగా వున్నదీ ఆయన యెందుకు గమనించలేదు? పరామర్శించ డానికి యివి ఆసక్తికరమైన ప్రశ్నలు. ఆదేమైనా 'కన్యాశుల్కం' తనస్థానిక వాతావరణంద్వారా, సజీవపాత్రలద్వారా, కడుపుబ్బనవ్వించే హాస్యంద్వారా మొదటిరాత్రి ప్రేక్షకుల హృదయాలను చూరగొంటుంది. అయినా, యే కారణాలవల్లనో గానీ దాని ప్రచురణ 1897 దాకా జరగలేదు. ఆనంద గజపతికిచ్చిన అంకితంలోగానీ, ఆంగ్లంలో రాసిన ముందుమాటలోగానీ 1897 మే లో సంభవించిన మహారాజావారి మరణ ప్రస్తావన లేదు. దీన్నిబట్టి, మహారాజావారు సజీవులై వుండగానే పుస్తకముద్రణ పూర్తిఅయిందని మనం

అనుమానించవలసి వుంది. 1897 జనవరి 21 నాటి ఒక పత్రికలో ఆ పుస్తకంమీద విమర్శవుంది కాబట్టి, రమారమి జనవరి మొదటివారంలోగానీ రెండోవారంలో గానీ దాని ముద్రణ పూర్తిఅయిందని దాదాపు నిశ్చయంగా చెప్పవచ్చు.

పుస్తకాన్ని పత్రికలకు పంపినప్పుడు మంచి సమీక్షలు వచ్చాయి. "తెలుగు నాటక రచనలో, ఆ మాటకొస్తే మొత్తం తెలుగు గ్రంథ రచనలోనే యిది సాహసోపేతమైన కొత్త మలుపు" అని 'ది పీపుల్స్ ఫ్రండ్' రాసింది. యిది "ప్రకృతికి అద్దం పడ్తుంది" అని 'ది వీక్లీ రెవ్యూ' రాసింది. యిది "చమత్కార హాస్యభరితమై కాలాను గుణంగా వుంది" అని 'ది దినమణి' అభిప్రాయపడింది. నాటకం గురించి బహుశా అన్నిటి కంటే శ్రేష్ఠమైన అంచనా యిచ్చింది 'ది తెలుగుహార్ప్.' యితర విషయాలతోపాటు ఆ సమీక్ష యిలా వుంది: "యీ నాటకంలో చాలా ఘటనలూ, హాస్యమూ వుండడమే గాకుండా మన పాత నాటకాల్లో తరచుగా దేని అభావం కొట్టవచ్చినట్లు కన్పిస్తుందో, ఆ అత్యవసర అంశమైన పాత్రచిత్రణ సయితం వుంది". 'ది చింతామణి' ఆశీఃపూర్వక ధోరణిలో తన సమీక్షను యిలా ముగించింది: "ప్రజల కందరికీ సుబోధకంగా వున్నయీ గ్రంథం దేశమంతా వ్యాపించి, సంఘ సంస్కరణకు తోడ్పడుగాక!"

నాటకానికి ప్రేక్షకుల నుంచీ, పాఠకుల నుంచీ వచ్చిన ప్రశంసలు అప్పారావుకు అమిత సంతోషం కలిగించి వుండాలి. కానీ, ఆ సంతోషం యెంతో కాలం లేదు. కొద్ది సంవత్సరాల తర్వాత, దాన్ని తిరగ రాయక పోయినా, సంస్కరించడం అవసరం అని ఆయనకు అన్పిస్తుంది. దానిలో ఆయనకు కన్పించే లోపాలు సాధారణ ప్రజల దృష్టిని తప్పించుకుంటాయి. "ఉల్లాస నూతన నాగంతుకు" ని కంఠం వింటున్నామని వాళ్లు సంతోషిస్తారు. అప్పటినుంచీ ఆయన పేరు "గురజాడ అప్పారావు పంతులు బి. ఏ, కాదు, పొడుగు పేరు లేని మోహనమైన పేరు 'గురజాడ'.

# 7. నిట్టూర్పుల వంతెనపై

"వెనిస్‌లో నిల్చున్నా, నిట్టూర్పుల వంతెనపై
యిటు రాజ ప్రసాదం, అటు కారాగారం

—బైరన్

గురజాడ కూడా అలాగే నిల్చున్నారు. కానీ యీ తేడాతో, ఆయన నిల్చున్న నిట్టూర్పుల వంతెన వెనిస్‌లో లేదు, విజయనగరంలో వుంది; ఆయన నిలబడవలసి వచ్చింది కొద్దిక్షణాలు కాదు, అనేక ఆయాసకరమైన సంవత్సరాలు. అదంతా ఆకస్మికంగా విషాదకరంగా ప్రారంభమైంది. యశోదీప్తమైన సాహిత్య జీవితం గురజాడకు సరిగ్గా మొదలవుతున్న తరుణంలో ఆనందగజపతి ఒక దుర్ఘటనలో మరణించారు. ఆ విషాద ఘటనలో గురజాడ యెంతగా అదరిపోయారంటే, యెంతగా దాదాపు కొయ్యబారిపోయారంటే, 1897 మే 23 నాటి తన డైరీలో ఆయన "మహారాజావారు తెల్లవారు జామున 3 గంటలకు గతించారు" అనే కఠోర వాస్తవాన్ని మాత్రమే రాసుకోగలిగారు. కొద్దిరోజుల తర్వాత కూడా ఆ దుర్ఘటనను వర్ణించేటప్పుడు, దుఃఖం దుర్భరమై ఆయన వాక్యం మధ్యలో ఆపేస్తారు. ఆయన నోటుపుస్తకాల్లో, హెచ్. హెచ్ అని గుర్తుపెట్టబడ్డ అరోపం భారమూ, దుఃఖభరితమూ అయిన నిట్టూర్పులా ధ్వనిస్తుంది: "అయ్యో! యికముందు నేను యెవరిమాటలూ, చేతలూ నమోదుచేయాలి."

"వెలగాడ కొండమీదికి[వనభోజనార్థం] వెళ్ళేటప్పుడు, నేను చేసిన యేర్పాట్లకు మహారాజావారు సంతృప్తి ప్రకటించారు. కొండమీద వున్నప్పుడుకూడా, చాలా ఆనందమయమైన రోజులుఅవి. మంచి గాలి, అందమైన ప్రకృతిదృశ్యాలూ, సంతోషదాయకమైన సహచర బృందం, రాజోచితమైన అనుగ్రహం. 'దుబారా మనుషులు నాకు నచ్చరు' అన్నారు మహారాజావారు. ఒక్క పూరట—నాకు తెలిసి నేను మహారాజావారికి అప్రతిష్ఠతేలేదు." మేము తిరిగి రావలసిన రోజున, యేనుగులమీదా, పల్లకీల్లోనూ, కాలినడకనా అందరినీ పంపించాక,

మహారాజావారూ, కె. యన్., నేనూ మిగిలాము. మహారాజావారు అప్పుడే స్నానం చేసి వున్నారు. ఉత్తరం నుండి పెద్ద యెఱ్ఱగాలి రావడం నాకు కన్పించింది. మహారాజా వారితో యీ విషయం చెప్పి, గాలి దుమారం ఆగిపోయిందాకా ఒక అరగంటసేపు ఆగుదామని విన్నవించుకున్నాను.

'అయితే ముందు మీరు పంపించివేసినవాళ్ళ మాట యేమిటి?' అన్నారు మహారాజావారు. నేను: అప్పుడు మనకు గాలిదుమారం కన్పించలేదు మహారాజా! మ. రా: 'పోనీలే, మనం వెళ్దాం'.

మహారాజా వారు ముందు వరండాలోకి వచ్చి, తమ గుర్రాన్ని తెమ్మన్నారు. యెఱ్ఱగాలి వీచ సాగినప్పుడు మహారాజావారు కాసేపు ఆలోచిస్తూ నిలబడి నాతో అన్నారు కదా: 'అవును ఇప్పుడు స్వారి చేయడం ధైర్య మనిపించుకోదు. మూర్ఖత్వమవుతుంది. నేను నడిచి వెళ్తాను. గుర్రాన్ని నా వెనక పంపించు'. మహారాజావారు అలా కొండ దిగి వెళ్లిపోయారు. వారి వెంట నరసింగరాజు కూడా వెళ్లారు. కొంతదూరం వెళ్లాక మహారాజావారు గుర్రాన్ని యెక్కి దౌడు తీసినట్లుంది – యేనుగులమీద వెళ్లేవాళ్ళను కలుసుకొని, వాళ్ళకేదైనా సాయం చేయవచ్చనే వుద్దేశంతో. పెద్దజల్లు పడింది. మహారాజావారూ, ఆయన బృందంలోని సర్వులూ తడిసి ముద్దయ్యారు. కొండ మీద నేను మహారాజావారి గురించి చాలా ఆందోళన పడ్డాను. తొందర తొందరగా అల్పాహారం ముగించి పల్లకిలో కొండ దిగి వెళ్లాను. మహారాజావారూ, ఆ బృందమూ అక్కడ ఆగారు. మహారాజావారు మావటి వానితో మేడ మీదున్నారు. ఎ. ఆర్., రెక్ పోట్లాడుకుంటున్నారు. మహారాజావారు వాళ్ళను మార్చి మార్చి అనునయిస్తూ వున్నారు, పోట్లాట అపడానికి నేను జోక్యం కలిగించుకున్నప్పుడు 'బలిష్ఠుడు' అని మహారాజావారు అన్నారు.''

అదురుపాటువల్లా, దుఃఖంవల్లా గురజాడ యీ కథనంలో అతి ముఖ్యమైన విషయం ఒకటి మరచిపోయారు. గాలిదుమారంలో గుర్రంమీద దౌడు తీసేటప్పుడు ఆనందగజపతి గుర్రంతో సహా కిందపడ్డారు. ఆయనకు రొమ్ముకు దెబ్బ తగిలింది. దెబ్బవల్ల జ్వరం వచ్చింది. నాల్గోరోజు ఆయన మరణించారు.

దుఃఖభరితమైన ఆ సంవత్సరం ముగిసినపుడు గురజాడ సంక్షుభిత హృదయం ఖావురుమంటుంది :

"యిది నాకు విపత్కరమైన సంవత్సరం. మే 23 తెల్లవారుజామున విజయనగరం మహారాజావారు-నేనెంతో ప్రేమించిన-తండ్రికన్నా, తల్లికన్నా భార్యకన్నా, బిడ్డలకన్నా యెక్కువగా ప్రేమించిన-మహారాజావారు మరణించారు. నిష్కల్మషమైన మంచితనంద్వారా, నిష్కపటమైన దయద్వారా, దైవసన్నిభమైన రుజుత్వంద్వారా, వారి స్వభావమూ, వ్యక్తిత్వమూ అత్యంత పరిణత మనస్సులనుండి నిస్వార్థమైన విధేయతను చూరగొనేవి. మా జీవితాలు వారి జీవితంతో పెనవేసుకపోయాయి. వారికోసం నేను యేదైనా చేసేవాణ్ణి-అజ్ఞాపించింది యేదైనాసరే. ఒక గొప్ప వెలుగు ప్రపంచంనుంచి నిష్క్రమించింది."

నిస్సంశయంగా యిది మితిమీరిన పొగడ్తే. తన దుఃఖతీవ్రత తగ్గిన తర్వాత, గురజాడ ఆనందగజపతిని గురించి మరింత స్థిమితమూ, మరింత సముచితమూ అయిన అంచనా వేయగలిగారు. ఆయన అమలుపరచని సాహిత్యపథకాల్లో మహారాజావారి జీవితచరిత్ర సయితం వుండివుండవచ్చు. ఆయన నోటుపుస్తకాల్లో హెచ్. హెచ్ అని గుర్తుపెట్టబడిన ఒక ఆరోపం-స్పష్టంగా యిరవయ్యో శతాబ్దం ప్రారంభమైన కొన్నాళ్ళతర్వాత రాసింది-యిలా ఉంది :

"ప్రశ్న సహజంగా తల యెత్తుతుంది : ఆనందరాజు జీవితచరిత్ర యెలా అవసరం? వీరుడుగా కానీ, రాజనీతిజ్ఞుడుగా కానీ, రచయితగా కానీ, సంస్కర్తగా కానీ ఆయన చరిత్రను సృష్టించారా? లేదు. ఆయన చరిత్రను సృష్టించలేదు. చరిత్రను, రాజకీయ చరిత్రను సృష్టించడానికి హిందువులలో ఎవరికోతప్ప అవకాశంలేదు. ఆనందరాజు సాహిత్యప్రయత్నాలు ఎప్పుడైనా ఒకసారి రాసిన పద్యాలకూ, అసంపూర్ణ దుర్గ్రాహ్య తాత్విక చర్చకూ పరిమితమయ్యాయి. ప్రతికూల పరిస్థితుల్లో ఆయన సంతరించుకున్న అద్భుతమైన వ్యక్తిత్వం వల్లనే ఆయన ప్రపంచదృష్టికి అర్హుడు. ఆయన పాత ప్రపంచానికీ, కొత్తప్రపంచానికీ మధ్యవుండే లంకె; హిందూ మహమ్మదీయ క్రైస్తవ

నాగరకతలకు ప్రతినిధి. ఆనాటి భారతదేశానికి అంతకంటే సంపూర్ణంగా ప్రాతినిధ్యం వహించగల మరొక మనిషి గత శతాబ్దిలో వుండడం సందేహం.''

అది ఆనందగజపతి జీవితచరిత్ర అయినా, మరొక సాహిత్యరచన అయినా, దాన్ని నిట్టూర్పుతో గురజాడ దాదాపు దశాబ్దంపాటు పక్కనపెట్టవలసి వచ్చింది. 1897కూ, 1906 కూ మధ్య ఆయన రాయగలిగింది 1901లో భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రి రాసిన 'శ్రీరామ విజయం' అనే సంస్కృత నాటకానికి ముందుమాటా, జి. సి. వి. శ్రీనివాసాచార్య రాసిన 'హరిశ్చంద్ర, అనే ఆంగ్ల నాటకానికి ఉపోద్ఘాతమూ. ఆ యిద్దరూ ఆయనకు విజయనగరం మిత్రులు. ఆయన రాసినవి రెండూ చిన్నవే, అవి ఒకేసారి మౌలికమూ, ఆధునికమూ అయిన ఆయన చైతన్యాన్ని స్పష్టంగా తెలియ చేస్తాయి. ఆ చైతన్యాన్ని సృజనాత్మకంగా వినియోగించేముందు మామూలుగా రాజస్థాన జీవితంలో ముడిపడివుంటే క్షుద్రమైన అసూయలనూ, ఖడాయిలనూ, కుహకాలనూ, కుతంత్రాలనూ, యింకా అసహ్యకరమైన అలాంటి యితర లక్షణాలనూ యెదుర్కోవలసి వుండింది. తరచుగా ఆ లక్షణాలు రాజు మరణించిన వెంటనే మరీ అసహ్యంగా వుంటాయి. తర్వాత తర్వాత విధేయుడూ సమర్థుడూ అయిన ఉద్యోగిగా గురజాడ రుజువుచేసుకోగలగినప్పుడు 'పెద్ద వ్యాజ్యం' అనబడే దానితోసహా, సంస్థానానికి సంబంధించిన దాదాపు అన్ని పెద్ద సమస్యలతో ఆయన వ్యవహరించవలసి వచ్చింది.

తన వుత్తరాధికారిగా యెవరినన్నా కొడుకుగా దత్తు తీసుకోవడానికి ఆనందగజపతి తన మరణానికిముందు తల్లి అలక రాజేశ్వరీదేవికి అధికారం యిచ్చారు. ఆమె తన మేనల్లుడు చిట్టిబాబును దత్తత తీసుకుంది. దత్తు సమయంలో అబ్బాయికి విజయరామ గజపతిరాజు అని పేరు మార్చారు. అతని మైనారిటీ కాలంలో సంస్థాన నిర్వహణ బ్రిటిష్ అధికార్లకు అప్పగించబడింది. కానీ, అలక రాజేశ్వరీదేవి, ఆమె వితంతు కుమార్తె అప్పలకొండయాంబా (ఆమెకే రీవా మహరాణి అనికూడా అంటారు) మైనరైన కుర్రవాని ప్రయోజనాలను అతిశ్రద్ధంగా రక్షిస్తున్నారు. బరువైన ఈ కర్తవ్యంలో గురజాడ అలక రాజేశ్వరీదేవికీ, ఆమె మరణాంతరం అప్పలకొండయాంబకూ ఆంతరంగిక కార్యదర్శిగా వున్నారు. ఆనందగజపతికి వుత్తరాధికారిగా తీసు

కున్న దత్తత చెల్లదని మహారాజావారి దగ్గరి దాయాదులు దావా వేశారు. 'పెద్దవ్యాజ్యం' అనే దానిమూలకారణం యిదే. రెండు పక్షాలవాళ్లూ మద్రాసుకూ, కలకత్తాకు చెందిన ప్రముఖ న్యాయవాదులను పెట్టుకున్నారు. మనకు కావలసింది చివరకు యిరుపక్షాలకూ 1913లో రాజీ కుదిరిందన్న విషయం; విజయరామ గజపతికి సంస్థానం దక్కింది. కీర్తిశేషుడైన ఆనందగజపతికి యిది చాలా నచ్చిన విషయమని గురజాడ విశ్వసించారు. అందువల్ల ఆయనకు యేదో సాధించానన్న తృప్తిలభించింది. కానీ అదే సమయంలో ఆయన అసంతృప్తికి గురికాకుండా వుండలేకపోయారు-ఆ కాలంలో సగ భాగానికి పైగా, ముఖ్యంగా 1897కూ 1906కూ మధ్య ఆయన తన సాహిత్యకృషిని వదలిపెట్టవలసివచ్చింది కాబట్టి.

'పెద్దవ్యాజ్యం' సాగిన రోజుల్లో కాస్త అవినీతిపరుడైన మనిషి యెవడైనా చచ్చినంతడబ్బు సంపాయించ గలిగేవాడు. నిజానికి విజయరామ గజపతి దత్తతను వ్యతిరేకించేవాళ్ళు గురజాడను తమవైపుకు తిప్పుకోడానికి ఒక రోజు అర్ధరాత్రి సమయంలో ఆయనకు పెద్దమొత్తం లంచం యివ్వజూపారు. దానికి గురజాడ ప్రతిస్పందన అచ్చం ఆయన స్వభావానికి అనుకూలంగా వుంది: 'బాబులారా! మీకు తెలుసుకదా నేను అజీర్ణరోగిని. ఒక తెళ్ళెడు అన్నం అరిగించుకోవడం నాకు కష్టం. గోనెడు కరుకు రూపాయల్ని యెలా అరిగించుకోను?, అన్నారు ఆయన. మరొక సందర్భంలో కూడాఆయన అలాంటి నిజాయితీనే ప్రదర్శించారు. కాస్మంద ఠాకూర్‌సాహెబ్ ఒకరాత్రి విలువలైన కానుకలతో గురజాడ దగ్గరకువెళ్ళి, తనకూతురులలితకుమారీదేవికి విజయరామ గజపతితో వివాహం కుదిర్చేందుకు గురజాడ సహాయం అభ్యర్థించారు. పెండ్లిసంబంధం కుదిరించడం తనకు చేతకాదని గురజాడ చెప్పకున్నారు. ఠాకూర్‌సాహెబ్ చాలా దిగులుపడి, తన కూతురును గంగానదిలో తోసేస్తానని అన్నారు. గాబరా కల్గించే ఆ సన్నివేశంనుంచీ బయటపడే మార్గం తోచక గురుజాడ మరునాటి వుదయం ఆ కానుకలన్నీ తీసుకొని, అలక రాజేశ్వరీదేవి దగ్గరకు వెళ్ళి, క్రితంరాత్రి జరిగిందంతా ఆమెకు తెలియచేశారు. అందరికీ సంతోషకరంగా పెళ్ళిసంబంధం అంగీకరింపబడింది. 1898లో కాశీలో పెళ్ళి జరిగింది.

ఆ కాలంలో రెండు కుటుంబ ఘటనలు జరిగాయి-ఒకటి సంతోషకరమైందీ, మరొకటి విషాదకరమైందీ. 1902లో గురజాడకు రెండో కూతురు

పుట్టింది. 1905లో ఆయనతండ్రి రామదాసు యెద్దులబండ్లో వంక దాటే టప్పుడు జరిగిన ప్రమాదంలో మరణించారు. యీ రెండు ఘటనలనూ సంకేతాలు గ్రహింపవచ్చు. జీవితం అంతా నిట్టూర్పులమయం కాదు. అది అంతా చిరునవ్వుల మయమూ కాదు. జీవితవస్త్రంలో సుఖదుఃఖాలు పడుగు పేకలు. గురజాడ జీవితవస్త్రంలో మసక రంగులకంటే నిండురంగులే ఎక్కువ. ఎంత పెద్ద దెబ్బతగిలినా, బాధాకరమైన దాని మొదటి తాకిడినుంచీ తేరుకున్న తర్వాత, ఆయన అపహాస్యం జేయగలిగేవారు. అంతేకాక, ఆయనకు జీవితంపట్ల మమత, ప్రపంచంపట్ల ప్రేమ, అనునిత్యం ఆశలురేపుతూ అందకుండాపోయే విశ్వపరమార్థంపట్లా, సృష్టి రహస్యంపట్లా మోహం.

అందువల్ల ఆయన సంస్థానానికి సంబంధించిన ప్రాపంచిక వ్యవహారాలతోపాటు, క్షుద్రమైన వ్యవహారాలనుకూడా, నిర్వహించివలసి వచ్చినప్పటికీ, తన సాహిత్య ప్రేరణలను మరీ యెక్కువకాలం పూర్తిగా అణచిపెట్టలేకపోయారు. ఆయన వేసవికాలంలో యేటేటా నీలగిరికొండలకు వెళ్ళడం 1903లో మొదలైంది. ఆ నీలగిరుల అలౌకికసౌందర్యం ఆయనలోని కవిని తిరిగి మేల్కొల్పి పాటలు పాడేటట్లు చేసింది. దానితో నిట్టూర్పుల వంతెన అవతలిగట్టుకు-నవ్వులూ, పరిహాసమూ, వ్యంగ్యమూ, సర్వవ్యాపకమైన ప్రేమా వుండేగట్టుకు-ఆయన దాటడం ఆరంభమైంది.

## 8. జగతి సమస్తం ఆయన బాధ్యత

"జగతిసమస్తం నా బాధ్యతగా చూస్తాను"

—జాన్ వేస్లీ

తెలుగులో కవిగా గురజాడ మొదటిరచన 'నీలగిరిపాటలు'. 1907లో మద్రాసులో ప్రచురితమైన ఆ పుస్తకం-దాన్లో ఆ ఆరుపాటలే కాకుండా, వాటి ఆంగ్ల అనువాదాలూ, సంగీతపుగుర్తులూ కూడా వున్నాయి-చాల చిన్న పుస్తకం. "హర్‌హైనెస్ విజయనగరం మహారాజకుమారికా సాహెబా శ్రీ అప్పలకొండయాంబ సుధోగడ్ (రీవాసంస్థానం) మహారాణి అజ్ఞమేరకు

రచింపబడిన" ఆ పాటలు 'మోహనరాకుమారిని ప్రియమైన స్మృతికి' అంకితం యివ్వబడ్డాయి. యీ పాటల్లో 'గురజాడ తన జీవితంలో మొదటిసారిగా, చివరిసారిగా కూడా, యేక కాలంలోనే పదబంధనిర్మాణ వ్యామోహంలో, ప్రణయావేశంలో మునిగిపోయారు అని బుర్రా వెంకటప్పయ్యగారు అంటారు. తుది ఫలితాన్నిబట్టిచూస్తే, రెండు ఆవేశాలూ అంత వేడిలేనవే అయివుండాలి. కాల్చి, చీల్చి, పిచ్చెక్కించే ప్రేమ అందామాఅంటే పాటల్లో దాని పొలకువే లేదు. యిక పదబంధాల విషయానికివస్తే మనకు కనిపించే వన్నీ అరిగిపోయినవీ, బూజు పట్టినవీ; స్మరణీయమైన పదబంధంగానీ, నుడికారంకానీ ఒక్కటి సయితం లేదు. గురజాడ జీవితంలో 'నీలగిరిపాటల' ప్రాముఖ్యమల్లా ఆయన మనస్సును మళ్ళీ సాహిత్యంవైపు మళ్ళించడం, న్యాయవాదులనుంచీ, న్యాయస్థానాల నుంచీ లభించిన తీరికలోని ప్రతి క్షణాన్నీ సాహిత్యానికి అర్పించడం.

నిష్కర్షగా చెప్పడానికి ఆయన డైరీలూ, నోటు పుస్తకాలూ మనకు తోడ్పడవు, కానీ యేళ్లుగడిచేకొద్దీ గురజాడప్రపంచ దృక్పథంలో† మార్పు వస్తూవుండినట్టు గట్టిగా చెప్పవచ్చు. 1883 లో గురజాడ మనస్సు యింకా లేతగా, అత్యంత గ్రహణశీలంగా వున్నప్పుడు శంభుచంద్ర ముఖర్జీ ఆయనకు చక్కని సలహా యిచ్చారు: 'నీలో కొన్ని శక్తులున్నాయి సాధనద్వారా వాటిని మెరుగు పరచుకో' అని. యింకా యిలా అన్నారు:

> "చదువు, పర్యాలోచించు. కవిత్వం మాత్రమేకాదు, అన్నిరకాల పుస్తకాలూ చదువు. అన్నిటికీమించి గమనించు. గమనించు మనిషినీ, ప్రకృతినీ, మనిషిపనులనూ, ప్రకృతి పనులనూ. అవకాశం దొరికితే దేశంతిరుగు. లేదా నీ దగ్గరి పరిసరాల్లోనే తిరుగు. మారుమూల పల్లెల్లోకి, అడవుల్లోకి, కొండల్లోకి వెళ్ళు. సముద్రతీరానికి వెళ్ళు. సూర్యుణ్ణీ, చంద్రుణ్ణీ గమనించు. మబ్బుల్నీ, తుపానుల్నీ గమనించు; సూర్యకిరణాల్నీ, మంచు బిందువుల్నీ గమనించు;

---

† జర్మన్ తత్వశాస్త్రపరిభాష వెల్తన్ షా వూంగ్ కు యిది దగ్గరిపదం. పూర్తి సంతృప్తికరమైంది. విశ్వానికి జీవితానికి సంబంధించిన ఒకరి తత్వ సంపూర్ణతను కానీ, భావ సమగ్రతను కానీ యిది యిముడ్చుకుంటుంది.

ఆకాశంలోని నక్షత్రాల్ని గమనించు ; పురాతన సముద్రంలోని అలల్ని గమనించు; జలపాతాల్నీ, సెలయేళ్ళనూ గమనించు. దివ్యమానవాకారంలోని అందమైన దాన్నీ, అందహీనమైనదాన్నీ గుర్తించడం మర్చిపోవద్దు. చివరి విషయం హృదయస్పందనల్ని గమనించు-నీవీ యితరులవీ వాటి బలబలాలు తూకం వెయ్యి. యీ విషయంమీద యితరులేం చెప్పిందీ జ్ఞాపకం పెట్టుకో. కానీ యెప్పుడూ యితరులపై ఆధారపడవద్దు. నీ ఆత్మను విశ్వసించు; నీ శక్తులకు స్వేచ్ఛనివ్వు.''

ఆనందగజపతి హఠాన్మరణం అనే తీవ్రాఘాతమూ ఆ మరణం మూలంగా యేర్పడ్డ 'పెద్దవ్యాజమూ' రచయితగా గురజాడకు ఆటంకాలైనా-మనిషిగా ఆయన పెరగడానికి తోడ్పడ్డాయి. 'పెద్దవ్యాజ్యం' కాక, న్యాయస్థానాల్లో యింకా చాలా చిన్న పోరాటాలు చేయవలసివచ్చింది. ఆ పోరాటాలకోసం ఆయన యెన్నో చోట్లకు-దగ్గర చోట్లకు, దూరం చోట్లకు-ప్రయాణం చెయ్యవలసి వచ్చింది ; యెంతోమందిని కలుసుకో వచ్చింది-గొప్పవాళ్ళనూ, తక్కువ వాళ్ళనూ, యెన్నో సమస్యలను- కొన్ని సున్నితమైనవీ, కొన్ని కష్టమైనవీ, తక్కినవి భయంకరమైనవీ- యెదుర్కోవలసి వచ్చింది. యీ అన్నిటిమూలంగా ఆయన చదివారు - చదివారంటే మామూలు అర్థంలో కాదు, అంతకంటే విస్తృతార్థంలో :

> ''ఆయనెంతో చదివారు.
>
> యింకా యెంతో చూశారు. నేర్చుకొన్నారు జీవితం నుంచీ
> మానవాళి మూల ప్రతినే పరిశీలించారు''

జాన్‌వేస్లీ (1703 - 1791) లాగే వురజాడ మానవాళిని పరిశీలించి దాని మూల ప్రతిని పరిశీలించి, సమస్త జగతిని తన బాధ్యతగా చూడడం నేర్చుకున్నారు. కానీ ఒక మౌలిక భేదం వుంది. వేస్లీది క్రైస్తవ ప్రపంచం, గురజాడది. మానవ ప్రపంచం, సమస్త కుల మత భేదాలకూ అతీతమైంది, సమస్త జాతీయ హద్దులనూ అధిగమించేది. తత్త్వవేత్తల్లో వోల్టేర్ (1694-1778) కామ్టే (1798 - 1857), మిల్ (1806 - 1873), కవుల్లో వర్డ్స్‌వర్త్ (1770 - 1850), షెల్లీ (1792 - 1822), బైరన్ (1788 - 1824); నాటక కర్తల్లో ఇబ్సెన్, షా - వీళ్లు గురజాడ మనస్సును తీర్చిదిద్దిన ఆధునిక యుగ

ప్రముఖుల్లో కొందరని చెప్పవచ్చు. పందొమ్మిదో శతాబ్ది చివరి పాదానికి, యిరవయ్యో శతాబ్ది మొదటి దశాబ్దానికి ఆయన చాలా దూరం పయనించారు. రాబర్ట్సన్, గిల్‌బర్గ్, పినేరో మొదలైన వాళ్ల సాహచర్యం వదలి ఇబ్సెన్ చేహోవ్, షా లాంటి మహోన్నతుల వెంటా, నూతన యుగానికి చెందిన యితర ప్రతిభాశాలుర వెంటా సమంగా ఆయన నడవసాగారు.

గురజాడను గురించి రాసిన రచయితలు లక్ష్మీనారాయణశాస్త్రిగారి 'శ్రీరామ విజయం' అనే గ్రంథానికి గురజాడ ముందు మాటను ప్రాసంగికంగా మాత్రమే ప్రస్తావిస్తారు. అంతకు మించిన పరిశీలనకు అది అర్హమైంది. 'ప్రాచీనుల గురించి గప్పాలు కొట్టుకట' అని తన నోటు పుస్తకాల్లో దేన్ని అన్నారో దాన్ని గురించి ఆ ముందు మాటలో గురజాడ తమాషా వ్యంగ్యంతో రాస్తారు. యీ కింది భాగం ఒక అచ్చమైన ఉదాహరణ:

"భూమిపైన కొత్తదేమీ లేదనే నమ్మకం నైష్ఠిక హిందువుల్లో విస్తృతంగా వ్యాప్తిలో వుంది. సృజనలు యీనాటి మరుగుజ్జుల కండ్లకు యెంత అద్భుతంగా కన్పించేవైనా, భావాలు చూడ్డానికి యెంత కొత్తవిగా కన్పించినా, ఆ నైష్ఠికుల అభిప్రాయంలో అవన్నీ ప్రాచీనులకు తెలిసినవే. కాబట్టి రాముడు కళ్ళెత్తి చూసి 'పొగలేని రైలు యింజన్లలాగా నిర్భయంగా నడుస్తున్న వాళ్ళెవరు' అని ఆశ్చర్యపడితే అందులో కాలవ్యత్యయం యేమీలేదు."

మొత్తం ఆ ముందు మాట అంతా యిలా తమాషా వ్యంగ్యధోరణిలోనే వుంది. అంతా వుల్లేఖించడం సాధ్యంకాదు కాబట్టి మరొక భాగం మాత్రం యిస్తాను:

"దైవజ్ఞులు నిర్ణయించిన శుభ ముహూర్తంలో సైన్యం ఆకాశగమనం ప్రారంభిస్తుంది. అప్పుడు హనుమంతుడు రాముని ఒక వింత వరం కోరతాడు – రాజకుమారు లిద్దరినీ తన భుజాలమీద యెక్కించుకొని సముద్రం దాటించడానికి అనుమతి యివ్వమని. కానీ, రామునికి ఆ మహావీరుణ్ణి మామూలు వాహనంలాగా వుపయోగించడం సుతరామూ నచ్చదు. అతని కోరికను కాదనడంకూడా రామునికి యిష్టం లేదు. సకల శుభాశుభ కర్మల్లోనూ ఆయుధం క్షత్రియునికి ప్రతినిధిగా గుర్తింపబడుతుంది. కాబట్టి రాముడు తన ఆయుధాన్ని లంకకు

మోసుకుపోవడానికి హనుమంతుని కిచ్చి, ఆ సందిగ్ధ స్థితినుంచీ బయటపడతాడు. సాహసోపేతుడైన వాయునందనుకి తృప్తి కలగదు. ఆ మొరటువీరుడు అక్కడ గుమికూడిన సేనాధిపతులతో సహా పర్వతాన్ని నెత్తిమీద పెట్టుకుని మోసుకపోతాడు. మానుష యువరాజును పర్వతం కదలడం గమనించి కొంతమంది సేనానాయకులు భయపడతారు. యెంతో ఆందోళనతో అంతకంటె తక్కువ కాని పాండిత్యంతో దాని కారణాన్ని చర్చిస్తారు. కొద్దిసేపట్లో వాళ్ళు సూర్యుని సమీపిస్తారు. సూర్య కిరణాలు దుర్భరమౌతాయి. సూర్యుని సమీపంలో వున్నప్పటికీ కొంతవరకు మతి చెడకుండా వున్న జాంబవంతుడు విశ్వపటం చూసి, తాము సూర్యునికి రెండున్నర మైళ్ళ దూరంలో మాత్రమే వున్నట్లు చెబుతాడు. భయంతో వానర నాయకుల గుండెలు నీరు కాబోతుంటే, హనుమంతుడు తటాలున కిందికి దిగి పర్వతాన్ని లంక తీరంలో నిలుపుతాడు. కాబట్టి, సింహళంలోని ఒకానొక కొండ భూగర్భపరిణామాల వల్ల యేర్పడలేదనీ, కోతి చేష్ట వల్ల అక్కడ చేరిందనీ ఆధునిక భూగర్భశాస్త్రజ్ఞులు గమనించాలి.”

యిక్కడ బీజ రూపంలో కనిపించేది కొన్నేళ్ల తర్వాత యిలా పాడిన కవేః

“వెనక చూసిన కార్యమేమోయి?
మంచి గతమున కొంచెమే నోయి
మందగించక ముందు అడుగేయి
వెనకపడితే వెనకే నోయి!”

కన్యాశుల్కం రాయడానికి ఆనందగజపతి ప్రేరణ యిస్తే, ‘నీలగిరి పాటలు’ అప్పలకొండయాంబ ‘ఆజ్ఞమేరకు రచింపబడ్డాయి’ కాబట్టి గురజాడ తన స్వీయ ప్రేరణతో యేళ్లమీదట మెల్లమెల్లగా రూపుదాల్చిన తన సొంత ప్రపంచ దృక్పథానికి అనుగుణంగా చేసిన మొదటి రచన ‘కొండుభట్టీయం’ అని చెప్పవచ్చు. 1906 లో ఆయన ఆ నాటకం పూర్తిచేశారు. కానీ దాని రాత ప్రతి యెక్కడో పెట్టి పోగొట్టుకున్నారు. కొన్నేళ్ళ తర్వాత ఆయన మొదటి రెండు అంకాలు మళ్లీ రాసిన మాట నిజమే. కానీ ప్రథమోత్తేజం అప్పటికి చాలావరకు క్షీణించింది. అయినా మనకు మిగిలిన ఆ శేషభాగాన్ని

టిట్టి అతి స్పష్టంగా అర్థమయ్యేది, యిక్కడొక చిన్న సంస్కరణా, అక్కడొక స్వల్ప రాజకీయ పురోగతీ సాధించడంలో ఆయనకు యిక యేమాత్రం ఆసక్తి లేదనీ, స్వభావంలో మరింత మౌలికమూ, పరిధిలో మరింత విస్తృతమూ అయిన మార్పులో ఆయనకు ఆసక్తి వుండిందనీ. సమాజ విమర్శకుని స్థితి నుంచీ మతవిమర్శకుని స్థితికి ఆయన మారారు. ఆయన లక్ష్యం యిప్పుడు నూతన సమాజంలో నూతన మానవుని రూపకల్పన, మరొకవిధంగా చెప్పాలంటే, యిప్పుడు ఆయన సంస్కర్తకాదు, విప్లవకారుడు. విప్లవకారుడుగా ఆయన ప్రాచీన కాలానికి చెందిన లూసియన్‌కూ, ఆధునిక కాలానికి చెందిన వోల్టేర్‌కూ సమానుడు. ఆ యిద్దరూ చమత్కారం, అపహాస్యం, వ్యంగ్యం తమ ప్రధాన ఆయుధాలుగా వాడారు.

# 9. జీవిత మంత విశాలం

"అది జీవిత మంత విశాలం, అంత రెండింతలు సహజం"

—లెవీస్ కరోల్

'కన్యాశుల్కం' రెండో కూర్పుకు రాసిన ముందు మాటల్లో గురజాడ యిలా అంటారు: "స్వల్పమైన మార్పులతో నాటకాన్ని పునర్ముద్రించాలని మొదట అనుకున్నాను. కానీ నా మిత్రుడు శ్రీ యస్. శ్రీనివాస అయ్యంగార్ సూచనతో నేను దాన్ని తిరగ రాశాను; అతని సాహిత్య అంచనాలపట్ల నాకు చాలా గౌరవముంది. ప్రస్తుత రూపంలో యిది దాదాపు కొత్త రచన". ప్రధానంగా ప్రముఖ న్యాయవాదీ, కాంగ్రెస్ రాజకీయవాదీ అయిన శ్రీనివాస అయ్యంగార్ సాహిత్య అంచనాలపట్ల గురజాడ గౌరవం యెంత నిష్కపటమైనప్పటికీ, అదొక్కటే 'కన్యాశుల్కం'ను "దాదాపు కొత్త రచనగా మార్చేట్లు గురజాడను ప్రేరేపించి వుండదు. ఆయన ఆ పని చేయడానికి అంతకంటే ముఖ్యమైన కారణాలు వున్నాయి. మొదటి విషయం ఆ నాటకం తిరగ రాసిన 1909 నాటికి ఆయన ప్రపంచ నాటక సాహిత్యాధ్యయనం మరింత విస్తృతమూ, గంభీరమూ అయింది. రెండోది, ఆనాటికి మానవ స్వభావం

గురించి ఆయనకు మరింత నిశ్చయమూ, సమగ్రమూ అయిన అవగాహన యేర్పడింది. మూడోది, ఆయన ప్రపంచ దృక్పథంలో స్పష్టమైన మార్పు వచ్చింది. నాల్గోది, వాడుక భాష వుపయోగించడంలో ఆయనకు మరింత యెక్కువ ప్రావీణ్యం అలవడింది. చివరిది, నాగరిక తదితర వర్గాలన్నిట్లో తనకెంతో మెప్పును సంపాదిస్తూ వుండిన తన సొంత బాణీ హాస్యాన్ని మరింత విస్తృతంగా వాడాలని ఆయన భావించారు. యేమైనా, సవరణ తర్వాత రూపొందింది. పరిమాణం బాగా పెరిగిన నాటకమూ, "దాదాపు కొత్త రచన" అయిన నాటకమూ మాత్రమే కాదు—అంతకంటే యెక్కువ. మొదటి రూపంలో మామూలు తరహా రచన కాకపోయినా సగటు రచనల కంటే ఒకటి రెండుమెట్లు మాత్రమే పైన వున్న ఆధునిక మహాకావ్యంగా పరిణమించింది.

'కన్యాశుల్కం' మొదటి కూర్పులో అయిదు అంకాలున్నాయి. రెండో కూర్పులో వాటి సంఖ్య యేడుకు పెరిగింది. రంగాల సంఖ్య రెండింటిలోనూ దాదాపు ఒకటే, అయితే రెండో కూర్పు పరిమాణం రెండింతలు. పాత పాత్రలు కొన్నిటిని విడిచి పెట్టడం జరిగింది; కొన్ని కొత్తవి ప్రవేశించాయి. కొన్ని పాత పాత్రలు అరుదైన సమ్మోహనశక్తి, చురుకుదనమూ వుండే కొత్త వ్యక్తిత్వాలు సంతరించుకున్నాయి. అలాంటి ఒక పాత్రను గురించి స్వయంగా గురజాడే యిలా అంటారు: "మొదటి కూర్పులో మధురవాణి నీరసమైన మట్టిముద్ద. యిప్పు డామెకు సర్వాంగ సౌష్ఠవం సమకూరింది. ఆమె నన్నే సమ్మోహితున్ని చేస్తోంది". యింకా యితర మార్పులు కూడా వున్నాయి. అన్నీ కలిసేటప్పటికీ, వాటి ఫలితంగా నాటకం ధోరణీ, నడకా మారిపోయి, అది అనన్య సాధ్యమైన కళాఖండంగా తయారైంది. అయితే రెండు పాఠాల్లోవున్న సామాన్య లక్షణం నాటక నిర్మాణం చక్కగా లేక పోవడం యెందుకు? ఆయన రాసిన కావ్యాల్లో, కథల్లో సమనిష్పత్తీ, అంగాంగ సంయోగమూ, సమతూకమూ ఖచ్చితంగా గుర్తించగల నిపుణ నిర్మాత హస్తం కన్పిస్తూంది. నాటకాలు రాసేప్పుడు యీ చేతిలోని మంత్ర దండం యేమైంది? అంతకంటే కూడా చిక్కయిన సమస్య: అది నిర్మాణ సౌష్ఠవం వుండే నాటకాల యుగం. ఫ్రాన్సుకు చెందిన సార్డూ (1831-1908) స్క్రైబ్ (1791-1861), యింగ్లండుకు చెందిన జోన్స్, పినేరో రెండో రకం నాటక కర్తలే అయినా, యితివృత్తాన్ని వాస్తవికంగా చిత్రించదలచుకుంటే,

వుండే రంగస్థల పరిమితులను దృష్టిలో పెట్టుకుంటే, నాటకాన్ని చక్కగా పొందికగా నిర్మించడం యెలాగో నిరూపించారు. నిర్మాణ సౌష్ఠవం వుండే చాలా నాటకాలు రెండో రకంవి. అయినంత మాత్రాన నిర్మాణ సౌష్ఠవం లేని నాటకాలకే గొప్పతనం అబ్బుతుందని చెప్పలేం. ప్రపంచ ప్రముఖ నాటక కర్తల్లో యిద్దరిని మాత్రమే పేర్కొనాలంటే—ఇబ్సెన్, చేహోవ్ తమ నాటకాల నిర్మాణంలో కౌశల్యం చూపారు. యీ విషయాలు గురజాడకు తెలియకుండా వుండవు. బెర్నార్డ్ షా రాసిన 'నాటకాభిప్రాయాలూ, వ్యాసాలూ' అనే సొంత పుస్తకం లోపలి టైటిల్ పేజిలో గురజాడ రాసుకున్న దీర్ఘా రోపాన్ని బట్టి తెలుస్తుంది: ఆయన మాటల్లోనే ఒక సమస్య యిది: 'వివరణలు యివ్వకుండా నాటకారంభంలో కథనూ, పాత్రలనూ ప్రవేశ పెట్టడం యెలా?' సమస్యను అలా ముందుంచి, దాన్ని పరిష్కరించడానికి ఆయన యెనిమిది మార్గాలు చెబుతారు. నిజానికి, నాటక శిల్పంలో తన నైపుణ్యం గురించి ఆయనకు యెంత ధీమా వుండిందంటే, అదే బెర్నార్డ్ షా పుస్తకంలో మరో చోట మార్జిన్‌లో ఆయన యిలా రాసుకున్నారు: "నేను నాటకం రాసేప్పుడు యే విధమైన నాటకశాలకైనా తగ్గినట్లు రాస్తాను".

అయినా, కన్యాశుల్కంలో దాని రెండు పాఠాల్లో నిర్మాణం వదులొదులుగా, గమనం యెగుడు దిగుడుగా, పాత్రల ప్రవేశ నిష్క్రమణలు అస్తవ్యస్తంగా వున్నాయి. నాటకంలోని యీ లోపాలకూ, యింకా యితర లోపాలకూ రెండు ముఖ్యమైన కారణాలున్నాయి. గురజాడ సృష్టించిన పాత్రలు, అవి చిన్నదైనా, పెద్దవైనా, యెంతో జీవశక్తితో తొణికిసలాడుతూ, నాటకాన్ని తమ వెంట యీడ్చుకపోతాయి. నాటకంలో చిట్టచివరి మాటలు—గిరీశం అనేవి, 'డామిట్, కథ అడ్డం తిరిగింది' తాను బాగా ఆలోచించి వేసిన పథకాలు విఫలమైనప్పుడు గిరీశానికి కలిగిన చికాకును వ్యక్తం చేయడమేకాక, తన మానస సంతానం తనను చెవిపట్టుకొని లాక్కుపోయినప్పుడు గురజాడకు కలిగిన చీదరను కూడా ఆ మాటలు వ్యక్తం చేయవచ్చు. రెండో కారణం చూద్దాం. షేక్స్పియర్ నాటకాలూ, యెలిజబెత్ కాలానికి చెందిన యితర రచయితల నాటకాలూ, చాలా యేళ్లపాటు కళాశాల విద్యార్థులకు బోధించిన తర్వాత గురజాడ వాటి ప్రభావానికి అమితంగా లోబడి వులడాలి. ఎలిజబెత్ కాలానికి చెందిన నాటకం యెక్కువగా ఆడంబరపూరిత దృశ్యం, పటాటోపపూరిత ప్రదర్శన లేదా ప్రచ్ఛన్న పాత్రల వుత్సవం, వాస్తవిక

నాటకం కాదు 'సహజవాద నాటకమూ కాదు.' మద్రాసు విశ్వవిద్యాలయం తన విద్యార్థులకు పరిచయంచేసే యేకైక శిల్పమైన యెలిజెబెత్ కాలం శిల్పాన్ని గురజాడ వదలించు కోలేక పోయారు. తత్ఫలితంగా ప్రదర్శించడానికి దాదాపు అసాధ్యమైన నాటకాన్ని ఆయన తయారు చేశారు' అని సి. ఆర్. రెడ్డి అనడం యెంతైనా సబబే. ఆయన యింకా యిలా అనడం కూడా సబబే:

"రంగాలు చిన్నవి, లెక్కలేనన్ని.* వాటిని ప్రదర్శించడానికి తగినన్ని తెరలూ వగైరాగానీ, శుభ్రంగా, దుర్భరమైన శ్రమలేకుండా ఆ పని చేయడానికి తగినంతమంది మనుషులుగానీ, యే మానవ సంస్థకూ వుండడం అసాధ్యం. పేజీలకు పేజీలు కథ దేకుతూపోతుంది. అని మిషులు మాత్రమే దాన్ని ప్రదర్శించగలరు లేదా ఆ ప్రదర్శనను చివరి దాకా చూడగలరు లేదా దేవతల్లాంటి ఓర్పుండే మన అమాయికమైన పల్లెటూరి జనమైనా కావాలి. కొన్ని భాగాలు విడదీస్తే నటించడానికి అద్భుతంగా వున్నప్పటికీ, అది చదువుకోతగ్గ నాటకం. కొన్ని భాగాలు యేరి ప్రదర్శిస్తే, వుత్తేజకరమైన ఫలితం వుంటుంది. కానీ యేమీ వదలకుండా ప్రదర్శించాలని యెవరైనా పట్టుబడితే, మొత్తం నాటకానికి తద్విరుద్ధమైన ఫలితం వుంటుంది. యెప్పుడు యెక్కడ ఆపవలసిందీ అప్పారావుకు తెలియదు. యీ బలహీనత ఆయన వుపన్యాసాల్లో కూడా కన్పించేది. ఒకసారి సెనేట్ హవుస్‌లో అనంతంగా సాగిన రాతప్రతిని ఆయన చదువుతూ పోవడం నాకు గుర్తుంది. ఆయన పక్కవున్నవాళ్ళు మొదట నైతికంగా, ఆతర్వాత శారీరకంగా ఆయనమీద ఒత్తిడి తేవలసి వచ్చింది.—ప్రపంచ వ్యవహారాల్లో క్రమం యిదే కదా! ఆయన యీ నాటకం రాసేప్పుడు సహృదయులూ, దృఢసంకల్పులూ అయిన మిత్రులు ఆయన పక్కన లేక పోవడం విచారకరం."

---

* గురజాడ రంగాలను గుర్తు పెట్టడంలో కాస్త అజాగ్రత్తగా వుంటారు. అందువల్ల రెండు కూర్పుల్లో దేన్లోనైనా మొత్తం రంగాల సంఖ్యను గురించిన అంచనాలు 32 కూ 35 కూ మధ్యవున్నాయి. 1918 లో బెంగుళూరులో యిచ్చిన 'ప్రాచ్య పాశ్చాత్యదేశాల్లో నాటకం' అన్న వుపన్యాసంలో రెడ్డిగారన్నట్లు వాటి సంఖ్య 150 అనడం పచ్చి అతిశయోక్తి.

గురజాడ పాత్రలు నాటకాన్ని తమవెంట యీడ్చుక పోవడంతోపాటు దాని ప్రధాన ప్రయోజనాన్ని భంగపరుస్తాయి. మొదటి కూర్పుకు రాసిన ముందు మాటను బట్టి ఆయన ఆ నాటకం రాసింది, బ్రాహ్మల్లో వ్యాపించి వుండిన శుల్క వివాహాల సాంఘిక దురాచారాన్ని యెదుర్కొడానికి. రెండు మూడేళ్ల వయస్సు సయితంలేని ఆడపిల్లలకు వాళ్ళ తల్లిదండ్రులు యెవరు యెక్కువ డబ్బు యిస్తామంటే వాళ్ళకు అమ్మివేసేవాళ్ళు. పెళ్ళికొడుకు యెంత ముసలివాడైతే అంతమంచిది. అతను అందరికంటే యెక్కువ డబ్బు యిస్తానంటాడు కాబట్టి. అతను కాటికి కాళ్లు చాపుకునివుంటే మరీ మంచి వరుడు—అతను గుటుక్కుమంటే అతని యావదాస్తినీ సంగ్రహించు కోడానికి మంచి అవకాశం లభిస్తుంది. కాబట్టి ఆ దురాచారం యెంత ప్రబలంగా, యెంత లజ్జా రహితంగా వుందంటే, పందొమ్మిది వందల యెనభైలలో, మూడేళ్ల కాలంలో ఒక్క విజయనగరం జిల్లాలోనే 1034 మంది ఆడపిల్లలు పెళ్ళిళ్ళ సంతలో అమ్మకమయ్యారు. వాళ్ళలో 'తొంభై తొమ్మిదిమంది పిల్లలకు అయిదేళ్ల వయసులో, పెళ్ళి అయింది. నలభై నలుగురికి నాలుగేళ్ళ వయసులో, ముప్పై ఆరుగురికి మూడేళ్ల వయసులో, ఆరుగురికి రెండేళ్ల వయసులో, ముగ్గురికి యేడాది వయసులో— యీ చివరి పసికూనలకు తలకు మూడువందలా యాభైరూపాయలనుంచీ నాలుగు వందల దాకా ధర పలికింది. విడ్డూరం అన్పించవచ్చు కానీ ఒకోసారి కడుపులో వున్న పిల్లలకు కూడా బేరాలు సాగాయి; ఆనంద గజపతి లాగే గురజాడ కూడా 'యీ దారుణ మైన స్థితి సమాజానికి అవమానం, అలాంటి ఆచారాలను బట్టబయలుచేసి, వున్నత ప్రమాణంగల నైతిక భావాలను ప్రచారం చేయడం కంటే వున్నత ప్రయోజనం సాహిత్యానికి వుండజాలదు' అని అనుకున్నారు. యిదంతా నిర్వివాదంగా నిజమే అయినా, మహా ప్రశంసనీయమే అయినా 'కన్యాశుల్కం' మొదటి కూర్పులో కూడా కన్యాశుల్కం సమస్య అంతంత మాత్రం గానే ముందుకు రాగలుగుతుంది. రెండో కూర్పులో కూడా యింకా వెనక్కు పోతుంది. నిజానికి 'కన్యాశుల్కం' సంఘ సంస్కరణకు తోడ్పటానికి బదులు దాన్ని అపహాస్యం చేస్తోందని వాదించే ప్రతికూల విమర్శకులు సయితంలేకపోలేదు. ఈ విమర్శ దుడుకుగా, మితిమీరిందిగా వున్నా, దీనిలో కొంత నిజం వుందని ఒప్పుకోవాలి.

క్రూరమైన, దాదాపు అమానుషమైన సాంఘిక దురాచారంలో పోరాడడం లక్ష్యమైనప్పుడు విధిగా దుడ్డు కర్ర వుపయోగించాలి. దానికి బదులు గురజాడ వుపయోగించేది చీపురు (నిజానికి నాటకం రెండో రంగంలో చీపురు వుపయోగించడం సయితం వుంది.) నాటకంలో అనేక పాత్రల్లో రెండు మూడు తప్ప అన్నీ చిన్నవీ, పెద్దవీ, అబద్ధాల కోరులు, దురాశాపరులు, అల్పబుద్ధులు, అమ్ముడు బోయేవాళ్లు కామాంధులు—ఒక్క మాటలో చెప్పాలంటే ద్వేషించదగిన మంద. కానీ, వాళ్లమీద మనకు ద్వేషం కలుగదు. సి. ఆర్. రెడ్డి అన్నట్లు, గురజాడ 'కన్యాశుల్కం' "జీవితంతో, మానవత్వంతో మెరిసిపోతోంది. దాన్లోవుండే స్త్రీ పురుషులు సకలాకర్షణలతో, దయాగుణాలతో వ్యవహరిస్తారు. సంప్రదాయానికీ, మమతకూ, అంధ విశ్వాసానికి చెందిన వింతగుణాలూ, క్రౌర్యాలూ, వెలుగు నీడలూ, పవిత్రతలూ, కాపట్యాలూ అతిగహనంగా పరస్పరం తలపడతాయి. చివరి విషయం, మన రచయిత అతి దివ్య సద్గుణం ఆయన పాత్రలు నమూనాలు కాదు, వ్యక్తులు." చిత్రంగా, నాటకంలోని ఒకే ఒక వ్యక్తి మంచి పాత్ర సౌజన్యారావు ఒక నమూనాకు అనుగుణంగా వున్నాడు, నీతిపరుని నమూనాకు. అతను 'కన్యాశుల్కంలో' కెల్లా అతి మంచి మనిషి; అతి నీరసమైన పాత్ర. మధురవాణి అతని ప్రభావం కిందికి వచ్చిన క్షణంలోనే భరించరాని పవిత్రమూర్తిగా మారుతుంది. మహాయుక్తిపరులైన దుష్టులనూ, భ్రష్టులనూ తన కొంగున ముడివేసుకొంటూ మనుషుల మతులు పోగొట్టే మనోహరమైన మధురవాణి, సౌజన్యారావుకు వినమ్రమైన శిష్యురాలిగా మారి, పవిత్ర పారాయణకోసం 'భగవద్గీత' ప్రతిని అతనివద్దనుంచీ బహుమతిగా తీసుకొనే మధురవాణి కంటే యెంతో సజీవమైన పాత్ర. పరివర్తన మరీ వుట్టిపాటుగా, బొత్తిగా అనవసరంగా వుంది. కొత్త అవతారం యెత్తేట్లు చేయగల బాధాకరమైన అనుభవం ఆమెకేమీ కలుగలేదు,

వ్యక్తిగా, రచయితగా గురజాడ కుండే విలక్షణగుణం హాస్యదృష్టి, నిండైన హాస్యదృష్టి ఆయనకు పుట్టుకతో వచ్చింది. జీవిత పరిస్థితులు దానికి పదును పెట్టాయి. ఆధునిక చైతన్యమూ, ఆధునిక విద్యా వున్న ఆ మధ్య తరగతి మనిషి, వేగంగా నశించిపోతున్న భూస్వామ్య సామాజిక వ్యవస్థకు అండదండ లివ్వడానికి తన జీవితమంతా అర్పించవలసి వచ్చింది. ఆనంద గజపతిపట్ల ప్రేమవల్లా, విధేయత వల్లా ఆయన అది చేశారు. కానీ లోలోపల

బాధపడ్డారు. ఆ బాధను వారించడానికి ఆయన తన హాస్యదృష్టిని రక్షా కవచంగా వాడుకోవలసి వచ్చింది. వయసు పైబడే కొద్దీ యెంత నిరంతరాయంగా ఆయన దాన్ని వాడుకున్నారంటే, దాదాపు ప్రతి సన్నివేశంలోనూ ఆయనకు హాస్యం కనబడసాగింది. చివరకు హాస్య శక్తిమీద యెంత నమ్మకం కుదిరిందంటే ఆయన నోటు పుస్తకాల్లోని చివరి ఆరోపాల్లో ఒకటి యిలా వుంది: "నేను యెంత హాస్యభరితంగా వున్నానో అంత ప్రచండంగా వుంటాను". హాస్య విధ్వంసక శక్తిపై తనకుండే నమ్మకాన్ని నొక్కి చెప్పడానికి కాబోలు ఆయన యీ మాటలు తన మామూలుకు భిన్నమైన పెద్ద అక్షరాల్లో రాశారు. యీ నమ్మకం కొంతవరకు అనుచితమైంది. ఆయన తన హాస్య దృష్టిని యెక్కువగా వుపయోగించింది 'కన్యాశుల్కం'లో. కానీ, దౌర్భాగ్యమైన కన్యాశుల్క దురాచారం మీద దాని ప్రభావం యే దశలోనైనా ప్రచండంగా వుండినట్లు మనం చెప్పలేం. కన్యాశుల్క స్థానంలో యిప్పుడు వరశుల్కం వుంది. యిది అగ్రకులాలన్నిట్లోనూ వ్యాప్తిలో వున్న దురాచారం. విచక్షణా యుతంగా వుపయోగిస్తే హాస్యం 'ప్రచండంగా' వుండగలదు. హాస్యాన్ని గురజాడ సద్యోజనితంగా వాడగలరు. దేదీప్యమానంగా కూడా వాడగలరు, కానీ విచక్షణా యుతంగా వాడడం ఆయనకు చేతకాదు. అందువల్ల తరచుగా ఆయన నవ్వువెనక నిస్సంశయంగా తారాడే కన్నీళ్లు అరుదుగా మన దృష్టికి వస్తాయి, అసలు దృష్టి కంటూవస్తే.

మౌళికంగా గురజాడకు సమస్యమీద కంటే మనుషులమీద, ఆసక్తి అధికం. మనిషిని మనిషిగా ఆయన ప్రేమించారు. విద్యావంతుడా, నిరక్షరుడా అనేదానితో, నీతిపరుడా, అవినీతిపరుడా అనేదానితో నిమిత్తం లేకుండా ఆయన మనిషిని ప్రేమించారు. నిజానికి మొదటి రకం మనుషుల కంటే రెండో రకం మనుషులనే ఆయన చాలా యెక్కువగా ప్రేమించారు. తన జీవితమంతా ఆయన 'పై తరగతి జీవితం' అనబడే దాన్ని సన్నిహితంగా పరిశీలించారు. మర్యాద ముసుగు చాటున దాక్కున్న ఆ జీవితం వెకిలి చేష్టలూ, పాపిష్టి చర్యలూ, క్రూర కర్మలూ ఆయనకు సుపరిచితాలు. 'పై తరగతి జీవితం'తో కలిగిన యీ పరిచయంవల్ల కింది తరగతి జీవితం'గా అందరూ యేవగించుకొనే దానిపట్ల ఆయనకు సానుభూతి యేర్పడింది. ఒక దృష్టిలో చూస్తే, సంస్కరణోద్యమ నాటకంగా 'కన్యాశుల్కం' విఫలం కావటానికి యిది తోడ్పడింది. మరొక దృష్టితో చూస్తే నాటకం 'దుర్నిరోధకమైన సమ్మోహక శక్తికీ, అజరామరమైన ఆసక్తికీ యిదే కారణం. నాటకం నిజంగా జీవితమంత విశాలం, అంత రెండింతలు సహజం.'

# 10. వున్నత వైఫల్యాలు

"హీనసాఫల్యం హద్దులను యెంతదూరం దాటిపోతుంది వున్నత వైఫల్యం"

—సర్ లెవిస్ మారిస్

గురజాడ 'కన్యాశుల్కం' *రాసేప్పుడు "ఆయన పక్కన సహృదయ మిత్రులు లేకపోవడం విచారకరం" అని సి. ఆర్. రెడ్డి అనడం తప్పు. అది నిజంకాదు గురజాడ పక్కన ముని సుబ్రహ్మణ్యం అనే యువ మిత్రుడు వున్నాడు. ఒక స్మృతి వ్యాసంలో ఆ మిత్రుడు యిలా రాశాడు:

"1905 లో నాకు ఆయన (గురజాడ) యాదృచ్ఛికంగా పరిచయమయ్యారు. అప్పుడు విజయనగరంలోని మహారాజా కళాశాలలో పేద విద్యార్థినైన నేను నా చదువుకోసం ఆయన సహాయం అర్థిస్తూ వుండేవాన్ని. మెల మెల్లగా, నాకు తెలియకుండానే నేను వుదయమూ, సాయంత్రమూ ఆయన బల్లవద్దనో, ఆయన గ్రంథాగారంలోనో చేరి, ఆయన చేస్తున్న రకరకాల సాహిత్య కృషిలో జోక్యం కల్గించుకునేవాణ్ణి. 1909 లో నేను కళాశాలలో డిగ్రీ పుచ్చుకొని, విజయనగరం వదలి, సొంత జిల్లా నెల్లూరు జిల్లాలో, ఆ తర్వాత కాకినాడలో తుదకు స్థిరపడ్డప్పుడు సాహిత్య కృషికి అంతరాయం కలిగి, దాన్ని వుత్తర ప్రత్యుత్తరాల ద్వారా కొనసాగింపవలసి వచ్చింది."

'కన్యాశుల్కం' రెండో కూర్పుకోసం తిరగరాసేప్పుడు గురజాడ, దాని ప్రూఫులను అప్పుడు నెల్లూరులో వున్న సుబ్రహ్మణ్యానికి దిద్దుబాట్ల కోసం, అభిప్రాయార్థం పంపేట్లు మద్రాసులోని ముద్రాపకులతో యేర్పాటు చేశారు. మొదట ధైర్యంచాలక అభిప్రాయాలు తెల్పడానికి సుబ్రహ్మణ్యం నిరాకరించాడు. కానీ, తర్వాత గురజాడ పదేపదే ఒత్తిడి చేయడంతో "నాటకం నీతి బోధకంగా లేదనీ, మధురవాణీ (ఒక వేశ్య), మీనాక్షీ (ఒక

* 'కన్యాశుల్కం' రెండో పాఠానికే యీ ప్రస్తావన.

బాల్య వితంతువు) కన్పించే రంగాలు ఆదర్శవంతంగా లేవనీ, నాటకం యువతీ యువకుల మీద దుష్ప్రభావం కలిగించవచ్చు కాబట్టి ప్రదర్శన యోగ్యం కాదనీ'' అభిప్రాయం తెల్పాడు. ఈ ఔత్సాహికమైన దాడిని గురజాడ సమర్థంగా యెదుర్కొన్న మాట నిజమే. అయితే దురదృష్టవశాత్తు ఆయన అంతటితో ఆగలేదు. ఆ యువ విమర్శకుని సంతోషపరచడానికి ఆయన మధురవాణి స్వరూప స్వభావాలు మార్చి అతనికి యిలా వుత్తరం రాశారు: ''అలా ఆమెను చివరి అంకంలో సంస్కరించాను. ఇక నీకు పేచీ వుండదు'' దీన్నిబట్టి తెలుస్తుంది. సృజనాత్మక రచయిత పక్కన యెవరూ వుండకూడదనీ, కళా దేవతతో అతనికుండే ప్రత్యక్ష సంబంధానికి యెవరూ భంగం కల్గించకూడదనీ. సృజనాత్మక రచయిత పక్కనవుండే మనిషి సహృదయ మిత్రుడు కాజాలడు, మరణాంతకమైన శత్రువే అవుతాడు.

'కన్యాశుల్కం' చివరి అంకంలో పాత్ర చిత్రణలో జరిగిన వికృతీకరణలకు సుబ్రహ్మణ్యాన్ని నిందించ వలసివస్తే, అతను మనకు చేసిన వుపకారానికి మెచ్చుకోవలసి వస్తుందికూడా. అతని ప్రమేయం లేకపోతే, గురజాడ ఆలోచనాశీలిగా, రచయితగా తన విశ్వాసాలను యిలా కంఠోక్తిగా ప్రకటించి వుండకపోవచ్చు. గురజాడను సక్రమంగా అర్థం చేసుకోవడంలో వాటికుండే ప్రాముఖ్యాన్ని బట్టి, 1909 మే 21 న వుదక మండలంలోని యెక్ హిల్ హౌస్‌నుంచీ ఆయన సుబ్రహ్మణ్యానికి రాసిన సుదీర్ఘమైన లేఖనుంచీ కొన్ని భాగాలు యిక్కడ వుల్లేఖించడమైంది:

> ''నిజమే—మీనాక్షి కన్పించే రంగాలు మరీ ఆదర్శవంతంగా లేవు. ఒక విషయం—నేను ఆనవాయితీలు వుటంకించగలను. మొదటిది, షేక్‌స్పియర్ రాసిన 'నాల్గో హెన్రీ' 'అయిదో హెన్రీ' 'మెర్రీవైవ్స్' అనే నాటకాల్లో డాల్టేర్ షీట్, మైన్ హోస్టెస్ డేమ్ అనే పాత్రలు సర్ జాన్ ఫాల్ స్టాఫ్‌తో కలిపి మహా ఆసక్తి దాయకమైన బృందం. వాళ్లలో యెవరూ ఆదర్శవంతులు కాకపోగా, పతితుడైన ఫాల్‌స్టాఫ్, వేశ్యాగృహంలో కంపువాతావరణంలోబతికే ఫాల్‌స్టాఫ్, షేక్‌స్పియర్ హాస్యానికి పరాకాష్ఠ. హోస్టెస్ కన్నా, డాల్ కన్నా మధురవాణి యెంతో మేలు.

"నాకు సరిగా జ్ఞాపకం వుంటే, ఓట్వే *రాసిన 'వెనిస్‌ప్రిజర్వ్‌డ్' అన్న నాటకంలో నిజంగా అసహ్యకరమైన రంగం ఒకటివుంది—పెద్ద ప్రభుత్వోద్యోగి వేశ్యదగ్గర అవమాన కరంగా ప్రవర్తించే రంగం".

"కళలో ఆదర్శీకరణ జరిగినప్పటికీ, వాస్తవిక రచనలో మన నైతిక దృష్టికి నచ్చని అంశాలుకొన్ని రాకతప్పదు. కొంతవరకు నైతిక అభిశంసన మనుషుల చిత్త వృత్తిపై ఆధారపడుతుంది".

"కవితా న్యాయం ఒకప్పుడున్నట్లు యిప్పుడు లేదు. నేను జీవితాన్ని చిత్రిస్తాను చిత్రించడంలో కళాగతమైన ఆదర్శీకరణ వుంటుందదనుకో. కళ నాకు యజమాని అయినా, సమాజంపట్ల నాకు బాధ్యత వుంది. కాబట్టి పాఠకుడు నన్నొక ప్రశ్న అడగవచ్చు. నేను అవినీతిని ఆకర్షవంతంగా చేశానా? లేదనే అనుకుంటున్నా".

నేనుజీవితంలో ఆడుకోవడం లేదని నీకుకన్పిస్తుంది. దానిపట్ల నా వైఖరి గురుతరమైంది. నవ్వులుచిందే పుస్తకంలో యిది కష్టమైన విషయం".

"సానిపిల్లలోని మానవత్వాన్ని మరువవద్దు. ఆమె కష్టసుఖాలు నీ, నా కష్టసుఖాల్లాగే గురుతరమైనవి. వ్యభిచరించే భార్యలూ, స్త్రీలోలురైన భర్తలూ, మన సమాజం నిండావున్నారు. వాళ్లు సానిపిల్లకంటే యెలా నయం? సానిపిల్లలో మోసం లేదు—ఆమె తన వృత్తిని మరుగుపరచడం లేదనే అర్థంలో. ఆమె యే వివాహబంధాన్నీ భగ్నం చేయడం లేదు".

"జపాన్‌లో వున్నత వంశీకులు పెళ్ళాడే గైషాలను గురించి యేమంటావు? గ్రీసుకు చెందిన అస్పాసియా నీకు తెలుసుకదా? లాండర్† రచనలు చదువు. ఆ రెండు దేశాలూ చరిత్రలో పేరు తెచ్చు కున్నాయి."

---

* థామస్ ఓట్వే (1652-1685) నాటకాలు స్వయంగా రాయడమేకాకుండా, రాసైన్, మోలియర్ల నాటకాలను ఆంగ్లంలోకి అనుసరించాడు. అతని వుత్తమ రచన 'వెనిస్ ప్రిజర్వ్‌డ్'. అందులో షాఫ్ట్సబెరీని అంటానియోగా అతను హాస్యంగా చిత్రించాడు.

† వాల్టర్ శావేజ్ లాండర్ (1775-1864) అతని అనేకరచనల్లో 'పెరిక్లీస్ అండ్ అస్పాసియా' ఒకటి. కానీ, ప్రధానంగా అతన్ని గుర్తుకు తెచ్చు కొనేది అయిదు సంపుటాల 'వూహా సంభాషణలు' రచయితగా.

గురజాడ మనస్సుయెంత విముక్తమైందో, ఆయన మానవత్వం యెంత విశాలమైందో యింతవరకు వుల్లేఖించిన భాగాలు తెలుపుతాయి. ఇక కిందవచ్చేది ఆయన తనకాలం కంటే యెంతో ముందుండినట్లు రుజువు పరుస్తుంది :

"మానవ విజ్ఞానం అధ్యయనం వల్ల సామాజిక భావాలను సవరించుకో వలసిన అవసరం యేర్పడింది. వాస్తవాలను దాటవేయడంవల్ల లాభం లేదు. లైంగిక బంధానికి అంత విలువ యివ్వడంలో అర్థమేముంది? సామాజిక పరిణామ చరిత్రలో వివాహ వ్యవస్థ ప్రాముఖ్యాన్ని నేను తగ్గిస్తున్నాననుకోవద్దు. గత రెండు శతాబ్దాల్లో మానవజాతి జ్ఞానం యెంతో పురోగమించింది. ఆలోచన పరులైన మనుషులు పాత భావాలనూ, పాత ఆదర్శాలనూ పరీక్షించడం ప్రారంభించారు. వివాహ వ్యవస్థ పురోగతికి తోడ్పడివుంటే, వివాహ బంధం అవిచ్ఛేద్యమైనదనే భావం అసంఖ్యాకమైన విషాదాలకు కారణమైందనే విషయం కూడా మరచి పోకూడదు."

"కథ యింకా ముగిసి పోలేదు. ఆంగ్లేయుల్లో పెళ్ళి అనేది లౌకికమైన ఒప్పంద అయింది. షెల్లీ, జార్జి యిలియట్ దాన్ని నిరాకరించారు. ఆధునిక మహిళ మానవ చరిత్రను తిరగరాస్తుంది."

"ఆధునిక మహిళ మానవచరిత్రను తిరగరాస్తుంది" అన్న గురజాడ మాట దాదాపు భావికాలజ్ఞతలా ధ్వనిస్తుంది. వందేళ్ళు గడవక ముందే ఆయన మాటలు నిజమయ్యాయి. ప్రతిచోటా స్త్రీ తన హక్కుల కోసం పోరాడింది. చాలా మేరకు వాటిని సాధించింది. మానవకృషికి సంబంధించిన ప్రతి రంగంలోకి ఆమె తోసుకొని వచ్చింది. అధికారమూ, ప్రతిష్ఠా వుండే కొన్ని అత్యున్నత స్థానాలు ఆమె అలంకరించింది. నిజమే, ఆమె కొన్ని దిశల్లో యింకా పురోగమించ వలసివుంది, కొన్ని అవిజిత దుర్గాల్లో యింకా తన జెండా యెగుర వేయవలసివుంది. ఆపని చేయడానికి "ఆధునిక మహిళ మానవ చరిత్రను తిరగరాస్తుంది" — అని ఆమె కోసంగురజాడ సృష్టించిన నినాదం కంటే వుత్తేజకరమైన నినాదం యేముటుంది ?

గురజాడ వుత్తరం దాని చివర పేరాగ్రాఫులో మహత్తరమైన శిఖరాలకు చేరుకుంటుందని చెప్పవచ్చు :

"వాస్తవాలను దాట వేయవద్దని నా కోరిక. కత్తితీసుకొని లోతుగా కోసి పరిశీలించు. ఆరాధించదగ్గ నిజమైన ప్రేమ మానవ ప్రేమే. ఆయన కాలానికి సహజపరిమితుల్లో యేసుక్రీస్తు బోధించింది లేదా బోధించాడని అనుకునేది అదే. కవితా కల్పనగా షెల్లీ బోధించింది అదే. సజీవ మతంగా బుద్ధుడు బోధించింది అదే. బౌద్ధ మతాన్ని రూపుమాపినప్పుడు భారతదేశం మత రీత్యా ఆత్మహత్య చేసుకుంది."

యీ మహనీయ దృక్పథముండే యీ మహనీయవ్యక్తే తాను పోగొట్టుకున్న 'కొండుభట్టీయం' నాటకాన్ని 1910 లో తిరగ రాయడానికి పూనుకుంది. మొదట మూడు అంకాలు మాత్రమే ఆయన అలా మళ్లీ రాయగలగడం విచారకరమైన విషయం. ఆ మూడు అంకాలు ఆయన వదలిపెట్టిపోయినట్లు ప్రచురింపబడక పోవడం అంతకంటే విచారకరమైన విషయం. ఆయన కొడుకు ఆ నాటకం మొట్టమొదటి పాఠంలో కొంత భాగం దొరికిందంటూ, 1939 లో ఆ రెండు పాఠాల అతుకుల బొంత అయిన ఒక పాఠాన్ని ప్రచురించారు. దాన్ని గురించి మనం చెప్పవలసిందల్లా అది 'కన్యాశుల్కా'నికి నిస్సారమైన అనుకరణ సయితం కాదు. నీరసమైన ప్రతిధ్వని సయితం కాదు.

రెండు నాటకాలకూ కొన్ని స్థూలమైన పోలికలు వున్నమాట నిజమే. ప్రాచీన గ్రీసు దేశానికి చెందిన లూసియన్‌కు యిటు తత్వశాస్త్రంలోనూ, అటు వేశ్యల్లోనూ ఆసక్తి వుండేది. గురజాడలో కూడా అలాంటి ఆసక్తుల సమ్మేళనం వుండేది. విజయనగరం సంస్థానంలోని రామస్వామి, వెంకటస్వామి నారాయణస్వామి మొదలైన 'స్వాముల' ద్వారా ఆయనకు భారతదేశ గణికతో పరిచయం యేర్పడింది. ప్రపంచ సాహిత్యం ప్రపంచ చరిత్రల అధ్యయనం ద్వారా ఆయనకు గ్రీసుదేశపు హెటైరాతో, జపాన్ దేశపు గైషాతో పరిచయం కలిగింది. లూసియన్ రాసిన 'వేశ్యా సంభాషణలు' ఆయన చదివి వుంటారని వూహించవచ్చు. లూసియన్, వోల్టేర్, గురజాడలను తులనాత్మకంగా పరిశీలిస్తే యెంతో వుపయోగకరంగా వుంటుంది. ఆ ముగ్గురి మధ్య చాలా పోలికలున్నాయి. అయితే లూసియన్‌లో పీడితులపట్లా, దళితులపట్లా కరుణలేదు. యిదంతా అప్రస్తుతం. 'కొండుభట్టీయం' విషయానికి తిరిగి వద్దాం. యిక్కడ మధురవాణి స్థానంలో మంజువాణి కన్పిస్తుంది. గిరీశం కూడా దర్శన మిస్తాడు. కానీ శాస్త్ర భిన్నమైన అవతారంలో. కొత్త అవతారం

పాత దానికంటే మేలైందో, పాడైందో చెప్పడానికి తగినంత సమాచారం లేదు. స్త్రీలోలురు పుష్కలంగా వున్నారు. అయినా 'కన్యాశుల్కా' నికీ దీనికి భేదం కొండుభట్టీయ సమకాలిక సమాజంమీద, మతంమీద సూటిగా దాడిచేస్తుంది.

గురజాడ సాంఘిక, మత సంస్కరణను గట్టిగా కోరేవారు. నిజానికి సర్వమతాలుపోయి, వాటి స్థానంలో మానవతా వాదంవస్తే అయన ఆహ్వా నించేవారు. అగస్టకామ్టే (1798 - 1857) లో ఆయనకు నచ్చింది, అతని మానవతా వాదం. ఆయనకు నచ్చినది అతను దానికి పూసిన మతం రంగు. కాబట్టి కొందరన్నట్లు, గురజాడ సాంఘిక మత సంస్కరణను అపహాస్యం చేశారనడం తప్పు. ఆయన అపహాస్యం చేసింది. సంస్కరణకు సంబంధించిన నటనను. మతాన్ని నీచత్వానికి, వంచనకూ ముసుగుగా వుపయోగించుకునే వాళ్ళను ఆయన యేవగించుకున్నారు. మత సాంఘిక సంస్కరణ పేరుతో ఒక ఐహిక లాభం పొందడాని ప్రయత్నించే వాళ్ళను ఆయన ద్వేషించారు. అలాంటి వంచకులను అపహాస్యం చేయడంలో ఆయనకుండిన అత్యుత్సాహం వల్ల సమస్త సంస్కరణకూ ఆయన వ్యతిరేకి అనే అభిప్రాయం కొంతమందిలో కలిగిన మాట వాస్తవమే. నిజానికి ఆయన కోరింది సంస్కరణను శ్రమించింది. సమస్త మానవాళీ నూతన శిఖరాలు అధిరోహించేట్లు, నూతన విషయాలు సాధించేట్లు మన ఆలోచనా విధానంలో, మనజీవిత విధానంలో మార్పు రావాలని ఆయన అభిలషించారు.

ఆయన రెండో అసంపూర్ణ నాటకమైన 'బిల్హణీయం' ప్రయోజనం పైదాని కన్నా పరిమితం. వాడుక భాష సాంఘిక హాస్యనాటకాలు రాయ డానికే కాక, కాల్పనిక నాటకాలూ, చారిత్రక నాటకాలూ రాయడానికి వుపయోగపడుతుందని వాడుక భాషా వ్యతిరేకులకు రుజువుచేసే నిమిత్తం ఆయన దాన్ని రాశారు. ఆయన యెన్నుకున్న యితివృత్తం కాల్పనికమూ, చారిత్రకమూ కూడా—దాని చారిత్రకత కొంత సందేహాస్పదమైనా, ఆ నాటకం మొదటి అంకాన్ని 1910 లో, రెండో అంకాన్ని 1911 లో ఒక పత్రికలో ఆయన ప్రచురించారు. తర్వాత దాన్ని యెందుకు ఆయన కొన సాగించలేదో మనకు తెలియదు. రాజకన్యతో బిల్హణకవి ప్రేమకు సంబం ధించిన పాత కథలకూ యీ ప్రచురిత ఖండానికి మధ్య చాలా భేదంవుంది.

రాజాసానం బాహ్య తీవి చాటున తమ వికృత రూపాలను దాచుకున్నా క్షుద్ర వైరాలనూ, కుయుక్తులనూ, అసూయలనూ, యితర నైచ్యాలనూ నిర్ధాక్షిణ్యంగా చిత్రించడంలో నాటకం ప్రారంభమవుతుంది. ప్రాసంగికంగా మతం మీదా, ఛాందస పాండిత్యం మీదా కొన్ని చురకలుకూడా వున్నాయి.

శిల్ప విషయంలో యీ రెండు నాటకాల్లో యేదీ 'కన్యాశుల్కం' కంటే మెరుగైంది కాదు. రంగాలు మరీ చిన్నవిగా, యెగుడు దిగుడుగా వున్నాయి. షేక్స్పియర్ ప్రభావమూ, రాబర్ట్సన్ ప్రభావమూ రెండూ కన్పిస్తాయి. 'నాల్గో హెన్రీ'లో అదృశ్యమై 'మెర్రీవైవ్స్ ఆఫ్ విండర్స్'లో మళ్లీ కన్పించే షేక్స్పియర్ పాత్ర ఫాల్స్టాఫ్ లా, ఫాల్స్టాఫ్కు ప్రతి రూపమైన గిరీశం 'కొండుభట్టీయం'లో మళ్ళీ కన్పిస్తాడు. ఆంగ్ల నాటక రంగంమీద రాబర్ట్సన్ ప్రభావం ప్రబలంగా వున్నప్పుడు, రంగస్థలం మీద నిజమైన గుర్రపుబండిని ప్రదర్శించారు. గురజాడ తన వంతుకు కొండుభట్టీయంలో నిజమైన రైలుబండిని యింజన్తో, పెట్టెలతో సహా ప్రవేశ పెడతారు! అంతకన్నా ముఖ్యంగా గమనించ దగింది నాటకం పేరుకు కారణమైన కొండభట్టు మహానీచులైన కొందరు బ్రాహ్మల మీద ప్రచండమైన దాడి చేయడానికి వుపయోగింపబడడం. అతను తార్పుడుగాడు. తను 'భూసురుడు' కాబట్టి, తనకు యేపాపమూ అంటదని వాదిస్తాడు.

'కన్యాశుల్కం' విషయంలో లాగే యీ అసంపూర్ణ నాటకాల్లోని పాత్రల్లో అత్యధిక భాగానికి వాస్తవ జీవితంలో మూలాలున్నాయి. కానీ అగ్రశ్రేణి సృజనాత్మక రచయిత లందరికీ తెలిసినట్లే, జీవితాన్ని సాహిత్యంతో మేళవించడం యెలాగో గురజాడకు తెలుసు. ఆయన నోటు పుస్తకాల్లో 'ఎం.ఓ.' అని గుర్తుపెట్టిన అంశం ఒకటివుంది. అది యిది "రచయిత తన పాత్రల నన్నిటినీ జీవితంనుంచి తీసుకోడు, తనకు తెలియకుండానే మునుపటి కవులు కల్పితపాత్రల గుణాలు కొన్ని దిగుమతి చేసుకుంటాడు."

ఖచ్చితమైన నాటక విమర్శక ప్రమాణాలతో చూస్తే 'కొండుభట్టీయం' 'బిల్హణీయం' వైఫల్యాలు; కానీ హీన సాఫల్యం హద్దులను దాటిపోయే వున్నత వైఫల్యాలు.

# 11. 'పుట్టుకతో కథకుడు'

"నా కెన్నో పర్యాయాలు అనిపించింది
కవిలాగే కథకుడు పుడతాడని"

—సర్ రిచర్డ్ స్టీల్

గురజాడ పుట్టుకతో, తెలుగు సాహిత్యంలో కథకుడు జన్మించాడు. మనకు అంతకు ముందే నీతి కథా, పుక్కిటి కథా, వీరగాథా, కట్టుకథా వున్నమాట నిజమే, కానీ కథానిక లేదు. కొంత వరకు దానివస్తువు మూలంగా, ముఖ్యంగా శిల్పం మూలంగా కథానిక యితర కథల కంటే భిన్నంగా వుంటుంది. దాని ప్రారంభం పాఠకులను అకట్టుకొనేట్లుగా ముగింపు ఆశ్చర్య కరంగా వుండాలి. మధ్యలో యెక్కడా అది దారి తప్పి సందుల్లోకి గొందుల్లోకి వెళ్ళకూడదు. ఒక జీవిత శకలాన్ని సంక్షిప్తంగా, కళ్ళెదుట నిల్చినట్లుగా చిత్రించడానికి అది ప్రయత్నించాలి. మహాప్రతిభావంతుడైన రచయిత యీ నియమాలనూ, సంప్రదాయాలనూ అన్నింటినీ వుల్లంఘించవచ్చు; కానీ ప్రతిభావంతులు అరుదు.

గురజాడ డైరీల్లోనూ, నోటుపుస్తకాల్లోనూ కనీసం వంద కథానికలకు ముడి సరుకు వుంది. కానీ, ఆయన రాయగలిగిందల్లా తెలుగులో నాలుగూ, ఆంగ్లంలో 'సంస్కర్త హృదయం' అనేదీ ఒకటిమాత్రమే. సంస్కర్తహృదయం అన్నిటికన్నా పెద్దది. దాని యితివృత్తం గురజాడ మనసును అధికంగా ఆక్రమించిన సంఘసంస్కరణ. దాని ప్రధానపాత్ర వుదాత్త వ్యక్తిత్వమూ, సుసంస్కారమూ వున్న ప్రొఫెసరు రంగనాథ అయ్యర్. అతనికి కొందు భట్టీయంలోని పిరికి సంస్కర్తలతో గానీ, ఐడాయి సంస్కర్తలతో గానీ పోలిక లేదు. అతను మరొక గిరీశం కానేకాదు. యవ్వనమూ, సౌందర్యమూ వుండి, మహా ప్రవీణురాలైన సరళ అనే సానిపిల్లను ఆ అసహ్యమైన వృత్తి నుంచి రక్షించాలనే అతనికోరిక నిష్కపటమైంది. కానీ అతనికి తెలియ కుండానే అతనిలో ఆమెపట్ల అభిమానం మొలకెత్తి, మెల మెల్లగా అది కోరి

కగా అభివృద్ధి చెందుతుంది. ఒకరోజు ఆమె వీణ వాయిస్తుండగా, అతను హఠాత్తుగా-ఆవేశంతో ఆమెను ముద్దు పెట్టుకుంటాడు. మరుక్షణంలోనే అతను తన జీవితాదర్శాలను తానే వుల్లంఘించినట్టు గుర్తించి, కళాశాలలో తన వుద్యోగానికి రాజీనామా యిచ్చి వెళ్ళిపోతాడు- యెక్కడికో యెవరికీ తెలియదు. ఈ కథానిక సామర్సెట్ మామ్ (1874-1965) రాసిన వర్షం అనే కథను గుర్తుకుతెస్తుంది. కానీ యిది దానికి అనుసరణకాదు. మామ్‌కు ఆ కథను గురించిన ఆలోచన 1916లో వచ్చినట్లూ, దాన్ని 1920లో రాసినట్లూ తనే తెల్పారు. గురజాడ 1915 లోనే మరణించారు.

గురజాడ తెలుగులోరాసిన కథల్లో రెండు 'సంస్కర్తహృదయం' కన్నా చాలా విధాల శ్రేష్ఠమైనవి. అవి చిన్నవి. వాటికి నాటకీయమైన ప్రారంభమూ, ఆశ్చర్యాన్నిగొలిపే ముగింపూ వున్నాయి; అవి నేరుగా అసలు విషయంలోకి వస్తాయి. వాటిలో అనవసరమైన తళుకుల్లేవు; అనవసరమైనమాట ఒక్కటికూడా లేదు. వాటిలో వున్న లోపమల్లా, ఆయన వాడుక, కేవలం అలవాటు బలంవల్ల దొర్లిన కొన్ని పురాతన తెలుగు పదాలూ, పదబంధాలూ. 'మీ పేరేమిటి' అనే కథకు నివ్వెరపాటు కలిగించే ప్రారంభంవుంది. 'దేవుడు చేసిన మనుష్యుల్లారా మనుష్యులు చేసిన దేవుల్లారా-మీ పేరేమిటి?' అనేప్రశ్నతో కథ మొదలవుతుంది. మరొక కథ 'తలుపు! తలుపు!' అనే ఆజ్ఞాపనతో మొదలవుతుంది. తలుపు తెరుస్తూనే మనం కథామధ్యంలోకి అడుగుపెడతాం!

ఆశ్చర్యం కల్గించే యీ శిల్ప చాతుర్యమేకాక, యితివృత్తాలను యెన్నుకోవడంలో కూడా గురజాడ పరిణత నైపుణ్యం ప్రదర్శిస్తారు. ఆయన యితర రచనలకున్నట్లే, కథలకు కూడా వుదాత్తమైన ప్రయోజనం వుంది. ఒక కథ మత విద్వేషాలకు సంబంధించింది. మరొకటి మతశాఖా కలహాలకు సంబంధించింది. రెంటిలో మొదటిదానిపేరు 'పెద్దమసీదు'-దాన్ని బుల్లి కథానిక అనవచ్చు. సుమారు అయిదువందల పదాలు మాత్రమే వుండే ఆ కథ యే ప్రపంచ వుత్తమ కథానికా సంకలనంలోనైనా చేరదగింది. గురజాడను గురించి రాసిన పలువురు రచయితలు దాన్ని అసంపూర్తి రచనగా పేర్కొన్నారు. వాళ్ళది పూర్తిగా తప్పు; అది సంపూర్ణమైన కథ. దానికి మరొక వాక్యం కలిపితే, మరొకమాట కలిపినా కూడా నాటకీయమైన దాని పతాక సన్నివేశబలం అంతా దెబ్బతింటుంది. ఒక బ్రాహ్మణ పండితుడు

చాలా యేళ్ళు కాశీలో గడిపిన తర్వాత శిష్యునితో కూడా స్వగ్రామానికి తిరిగివస్తాడు. ఊరి పొలిమేరల్లో వుండగానే, కన్పించవలసిన పురాతన దేవాలయ గోపురం కన్పించకపోయేసరికి అతనికి యెంతో దిగులు కలుగుతుంది. దానిస్థానంలో మసీదుగోపురాలు కన్పిస్తాయి. పండితుడు వచ్చినదారి వెళ్ళాలనుకుంటాడు. కానీ, మనసు మార్చుకోమని శిష్యుడు నచ్చచెబుతాడు. దేవాలయం స్థానంలో మసీదు యెళా యెప్పుడు యేర్పడిందీ తెలుసుకునే నిమిత్తం, యిద్దరూకలిసి నేరుగా మసీదువద్దకు వెళతారు. వాళ్ళ ప్రశ్నలకు యిమాం జవాబులు ముక్తసరిగా, బండగా వుంటాయి. అయినా గుడి సమీపంలోవుండి తన దగ్గరి బంధువులు యేమైందీ తెలుసుకోవాలనే తాపత్రయంలో ఆ పండితుడు వాళ్ళను గురించి అడుగుతాడు. దాంతో ఆ యిమాం ఆ పండితుని మేనల్లుడే అని తెలుస్తుంది. మరుక్షణంలోనే యిద్దరూ ప్రేమపూర్వకంగా కౌగలించుకుంటారు! దీన్ని అసంపూర్తి కథ అనడం వెర్రితనం కాదా? అంతేకాదు గురజాడ పరిణతనైపుణ్యానికి అపచారం గాదా! సకలకాలాలకు వర్తించే సందేశం, మతంకంటే రక్తసంబంధం బలీయమైందనే సందేశంతో అసాధారణమైన మానవ హృదయాసక్తి వుండే కథను ఆయన కేవలం సుమారు ఐదువందల పదాల్లో కుదించారు!

దీనికన్నా చాలా పెద్దదైన యింత శక్తిమంతం కాని కథ 'మీ పేరేమిటి?' అనేది. అది వైష్ణవ శైవశాఖలు తమతమ ఆధిక్యాన్ని రుజువుపరచుకోడానికి చేసే వాదాలు బూటకమనిపిస్తుంది. ఆ వాదాలు వెనుక వుండే స్వార్థాన్నీ, జిత్తులనూ బట్టబయలు చేస్తుంది. వేరు వేరు పేర్లున్నా భగవంతుడు ఒకడే అయితే యెన్నెన్నో పేర్లుగల యీ అనేక దేవతలను కట్టగట్టి తగలపెట్టాలనీ, అప్పుడు ఆ యేకైక భగవంతుని అందరూ సమైక్యంగా ఆరాధించ వచ్చుననీ కథ ముగిస్తుంది.

తక్కిన రెండు కథల్లో ఒకటి యుక్తిపరురాలైన ఒక భార్య చుట్టూ అల్లబడింది. ఆమె ఒక యుక్తిపన్ని తప్పుదారిలో పోతున్న భర్తను అదరగొట్టి దారిలోకి తెస్తుంది. మరొక కథ అనుమానించే ముసలి మొగుడికి ముడిపెట్టబడిన పడుచు భార్యకు సంబంధించింది. యీ కథల్లో కూడా మెచ్చుకోతగ్గ గుణాలున్నాయి. అయితే నిశ్చయంగా యివి తక్కువ స్థాయికి చెందినవే.

గురజాడ రాసిన అయిదు కథలనూ విమర్శనాత్మకంగా పరిశీలిస్తే, అలాంటివి కనీసం యాభై అయినా ఆయన రాసివుంటే బావుండుననిపిస్తుంది.

కనిపిస్తుంది. 'కన్యాశుల్కం' ఒక్కటే ఆయన బృహద్రచన కావడానికి శారీరక దౌర్బల్యమే కారణం కావచ్చు. ఆ 'కన్యాశుల్కం' కూడా నిజానికి అనేకమైన చిన్నచిన్న ముక్కల సమాహారమేతప్ప అది ఒక యేకీకృత సజీవ సమస్తంకాదు. ఆ నాటకాన్ని వందసార్లుకు పైగా ప్రదర్శించిన అబ్బూరి రామకృష్ణారావు దాన్ని, సులభంగా పద్దెదు యేకాంకి కలుగా విభజించ వచ్చునంటారు. ఆ యన మాటను సులభంగా కాదనడానికి లేదు. తాను యెన్నుకున్న రచనాప్రక్రియ చిన్నదయ్యేకొద్దీ గురజాడ ప్రతిభ వికసిస్తుందన్నమాట! ఆయన కథలకంటే యెక్కువగా, అన్నీ చిన్నవే అయిన ఆయన కావ్యాలూ, పాటలూ యీ అభిప్రాయాన్ని ధ్రువ పరుస్తాయి.

# 12. దండగా కూర్చిన మంచిముత్యాలు

"ఆయనే ఒకచోట చేర్చింది చెల్లాచెదురుగావున్న మాటల్ని
ఆయనే మంచి ముత్యాల్నితొలిచి దండగా కూర్చింది"

—పిల్పే

పైన వుల్లేఖించిన పిల్పే యెవరు? అతన్ని పిల్‌పాయ్ అనికూడా అంటారు. బిద్‌పాల్ అనే మరో పేరు సయితం అతనికి వుంది. మనలో చాలా మందికి ఆశ్చర్యం కలగవచ్చు గానీ పశ్చిమాసియాలో యీ మూడు పేర్లతో చలామణి అయ్యే అత నెవరో కాదు, 'పంచతంత్రం' రాసిన భారతీయుడే. విద్యాపతి అతని బిరుదనామం. పిల్పే, పిల్‌పాయ్, బిద్‌పాల్ అనేవి ఆ బిరుద నామం భ్రష్టరూపాలు. ఆ ప్రాచీనకాలానికి చెందిన విద్యాపతిలాగా గురజాడ కూడా" చెల్లా చెదరుగా వున్న పదాలను ఒకచోట చేర్చారు. సరాలుగా కూర్చడానికి 'మంచి ముత్యాల'ను తొలిచారు. ఎంత అద్భుతంగా వున్నాయి ఆ సరాలు! అవి సాధించిన అద్భుతం ఒక్క అంగలో అవి తెలుగు కవిత్వాన్ని మధ్య యుగంనుంచీ ఆధునిక యుగంలోకి తెచ్చాయి. ఛాందస

పండిత బృందాల దగ్గరనుంచీ సామాన్య ప్రజల దగ్గరకు తెచ్చాయి, రుచీ పచీలేని నీరస స్థితినుంచీ నవనవోన్మేషమూ, పరిమళ భరితమూ అయిన స్థితికి తెచ్చాయి.

మనం యింతకుముందే గమనించినట్లు, తెలుగు కవిత్వంలో గురజాడ మొదటి ప్రయత్నం ఆశాభంగం కలిగించింది. ఆయన రచించిన 'నీలగిరి పాటలు' ఆయన నిర్విమర్శకాభిమానులు ప్రశంసించినా, అవి ఆయనలాంటి నూతన పథ నిర్దేశకుని యోగ్యతకు తగినవికావు. పద గుంఫనంలో గానీ, వస్తువులో గానీ, అలంకారంలో గానీ లేశమాత్రం కొత్తదనం కూడా వాటిలో కన్పించదు. కాబట్టి అచ్చమైన వుత్తేజం కలిగే సమయం వచ్చేంతవరకు ఆయన ఆగవలసి వచ్చింది. ఆ సమయం అనతి కాలంలోనే వచ్చింది. యాదృచ్ఛికంగా విన్న ఒక జానపదం గీతం యొక్క మనోహరమైన లయ ఆయనను నిలువునా వుద్రూత లూగించింది. దాని మంత్ర కట్టులో యిలా ప్రకటించారు :

"గుత్తునా ముత్యాల సరములు
కూర్చుకొని తేటైన మాటలు,
కొత్తపాతల మేలు కలయిక
క్రొమ్మెరుంగులు జిమ్మగా"

ఆ ప్రకటనతో రెండు వస్తువులు జన్మించాయని చెప్పవచ్చు. ఒక కొత్త ఛందస్సూ, ఒక కొత్త కవితా సంప్రదాయమూ, కొత్త ఛందస్సుకు గురజాడ ముత్యాల సరాలు అని పేరు పెట్టారు. సాహసోపేతమైన తన కొత్త ఛందస్సుకు పాత కాపులనుంచీ గట్టి ప్రతిఘటన యెదురవుతుందని ఆయనకు ముందే తెలుసు. ఆ ప్రతిఘటన పట్ల తిరస్కారం వెల్లడించారు :

"మెచ్చనంటా వీవు; నీవిక
మెచ్చకుంటే మించి పాయను;
కొయ్యబొమ్మలె మెచ్చు కళ్ళకు
కోమలుల సారెక్కునా"

వుత్తేజితుడైన అచ్చమైన కవిలా గురుజాడ సుదూర భవిష్యత్తులోకి దృష్టి సారించి యిలా ప్రకటిస్తారు :

"చూడు మనుమును మేటివారల
మాట లనియెడు మంత్ర మహిమను
జాతి బంధములన్న గొలుసులు
జారి సంపద లబ్బెడున్

యెల్ల లోకము వొక్క యిల్లై,
వర్ణభేదము లెల్ల కల్లై
మేల మెరుగని ప్రేమబంధము
వేడుకలు కురియ
మతము లన్నియు మాసిపోవును,
జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును,
అంతస్వర్గ సుఖంబు లన్నియు
యవని విలసిల్లున్

ఆచంట జానకిరామ్ అన్నట్లు, యీ పాదాల్లో గురజాడ "నానాజాతి సమితి భావాలనూ, అట్లాంటిక్ చార్టర్ భావాలనూ, ఐక్యరాజ్యసమితి భావాలనూ కొన్ని దశాబ్దాలు ముందుగా" ప్రకటించారు. ఆయన తన తెలుగును ప్రేమిస్తారు. కానీ ఆ ప్రేమ యితర భాషలను కూడా కలుపు కుంటుంది. యెందుకంటే, యితర జంతువులనుంచీ మానవుని మొదట వేరుపరచింది భాషే. ఆయన తన దేశాన్ని ప్రేమిస్తారు. కానీ ఆ ప్రేమ యితర దేశాలను వెలివేయదు. కారణం, అన్నిదేశాలూ 'యేక ప్రపంచ' మౌతాయి. అందువల్ల దేశభక్తి మీద వుత్తేజకరమైన గేయం రాసినప్పుడు కూడా ఆయన భారతదేశ చరిత్రనూ, భౌగోళిక పరిస్థితులనూ ప్రస్తావించరు, భూగర్భ విషయాన్నీ, జాతులనూ ప్రస్తావించరు, వృక్ష సంపదనూ, జంతు సంపదనూ ప్రస్తావించరు, కేవలం మనిషిగా మనిషిని ప్రస్తావిస్తారు. ఆ మనిషి భారత జాతికిచెందినా సరే, మరేజాతికి చెందినా సరే. అంతేకాదు, దారితప్పిన దేశభక్తులను ఆయన యిలా మందలిస్తారు కూడా.

"దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే మనుషులోయ్"

ఒక్కొక్క 'ముత్యాల సరం' పూర్తి అయ్యేకొద్దీ తాను సృష్టించిన ఛందస్సు మీద గురజాడకు ఆధిపత్యం లభించింది. దాని అనంతమైన అవ

కాశాలను ఆయన పూర్తిగా వినియోగించు కున్నారు. అది ఒకోసారి మలయ మారుతంలా మెల్లగా ప్రసరించేట్లు, ఒకోసారి దూరానవున్న సెలయేటిలాగా గలగల మని మర్మరించేట్లూ, ఒకోసారి వుదయాకాశంలా గులాబి రంగులు ధరించేట్లూ, ఒక్కోసారి వర్షాకాలం కారుమబ్బుల్లాగా సుళ్ళు తిరిగేట్లూ, ఒకోసారి శరశ్చంద్రికా కిరణాల్లా సుకుమారంగా చుంబించేట్లూ చేస్తారు. ఆయన యేమిచేసినా యెప్పుడూ తన గాంభీర్యంతో, వుదాత్తతతో, తన సౌంద ర్యంతో, శక్తితో, అది మనల్ని సమ్మోహన పరుస్తుంది. యిదంతా, యింకా యెక్కువగా కూడా, కేవలం సుమారు డజను కవితా ఖండికల్లో ఆయన సాధిస్తారు. అన్నిటికన్నా పెద్ద ఖండికలో సయితం నాలుగువందల పాదాలకంటే తక్కువే వున్నాయి. ఎగతాళి చేస్తూ, మేళమాడుతూ, నవ్వుతూ, వెలుగులుచిమ్మే గురజాడకు బదులు యీ ఖండికల్లో గంభీరుడూ, ప్రశాంతుడూ అయిన గురజాడ కన్పిస్తారు. ఆయన వుపదేశం యివ్వరు. పీఠాధిపతిలాగా ధర్మసూక్తులు వల్లించరు. ఛాందస పండితునిలా కూడా ప్రవర్తించరు. ఆయన బుల్లి బుల్లి మాటలకు రెక్కలు తొడుగుతారు: వాటిని మానవతావాద సందేశహరులుగా తీరుస్తారు. పేదరికం లేని ప్రపంచం, భయం తెలీని ప్రపంచం, మూఢ విశ్వాస ప్రవర్తన లేని సమాజం— యివి ఆ వాదం పునాదులు-మతాలూ, మత శాఖలూ, గణాలూ, జాతులూ, కులాలూ, వర్గాలూ మానవతావాదానికి అడ్డుపడితే వాటిని వూడ్చి పారవేయ వలసిందే, దేవతలైనా సరే ఆ దారిని అడ్డగిస్తే వాళ్ళను నెట్టి పారవేయవలసిందే. మానవుడు వివేకం వల్లా, జ్ఞానం వల్లా, ప్రేమ వల్లా, కరుణ వల్లా, విజ్ఞత వల్లా నడిపింపబడుతూ, మరింత సంపూర్ణమూ, వుదాత్తమూ, అర్థవంతమూ అయిన జీవితాన్ని అన్వేషిస్తూ ముందుకు సాగాలి. గురజాడ వూహించే భవిష్యత్తులో :

"చెట్టపట్టాల్ పట్టుకోని
దేశస్థులంతా నడవవలెనోయ్,
అన్న దమ్ములవలెను జాతులు
మతము లన్నీ మెలగ వలెనోయ్;

మతం వేరైతేను యేమోయి
మనసు వొకటై మనుషులుంటే
జాతమన్నది లేచి పెరిగి

లోకమున రాణించునోయి!
దేశమనియెడి దొడ్డ వృక్షము
ప్రేమలను పూలెత్త వలెనోయ్
నరుల చమటను తడిసిమూలం
ధనం పంటల పండవలెనోయ్!''

గురజాడ నాటకీయతలో, తాత్వికతలో ప్రతిభాశీలి కాబట్టి; కథన కవితలో అయన అత్యుత్తమంగా రాణిసారు. ఆయన 'కన్యక', 'పూర్ణమ్మ' మనకు కళ్ళనీళ్ళు తెప్పించేంత విషాదభరితంగా వున్నాయి. కామాతురుడైన రాజు చేతిలో మైల పడకుండా కన్యక మరణమే కోరుకుంటుంది. ఆత్మహత్య చేసుకునే ముందు ఆ మానవరూప పశువుతో ఆమె యిలా అంటుంది :

''పట్టమేలే రాజు అయితే
రాజునేలే దైవ ముండడా ?''

కుందనపు బొమ్మలాంటి పూర్ణమ్మను ఆశపోతైన తండ్రి ఆమె తాత కాదగినంత వయసుండే ముసలోని కిచ్చి పెళ్లి చేసినప్పుడు ఆమె గ్రామ దేవాలయ పుష్కరిణిలో పడి ఆత్మహత్య చేసుకుంటుంది. అలా దుర్మరణం చెందినప్పుడు :

''కన్నుల కాంతుల కలవల చేరెను
మేలిమి జేరెను మేని పసల్
హంసల జేరెను నడకల బెడగులు
దుర్గను జేరెను పూర్ణమ్మ.''

పూర్తిగా మరో రకానికి చెందిన కథా కావ్యం 'లవణరాజు కల'' 'యోగ వాసిష్ఠం'లోని ఒక ఘట్టంపై ఆధారపడ్డ ఆ కథ గురజాడ చేతుల్లో కొత్త అర్థం సంతరించుకొని, కొత్త సందేశం అందిస్తుంది. మానవాళి సమానతకూ గౌరవానికీ చెందిన సందేశం. కలలో లవణరాజు ఒక మాల కన్యను ప్రేమించి పెళ్ళాడాలనుకుంటాడు. కులభేదం కారణంగా ఆమె అతన్ని వారించబోతే, అతను యిలా అంటాడు :

''మంచి చెడ్డలు మనజు లందున,
యెంచి చూడగ, రెండె కులములు
మంచి యన్నది, మాలయైతే
మాలనే, అగుదున్''—

'లవణరాజుకల'తో పోలిస్తే, గురజాడ రాసిన 'డామన్ పితియన్' చాలా అసంతృప్తికరంగా వుంది. డామన్, పితియన్ అనే యిద్దరు గ్రీకులకు సంబంధించిన రోమన్ గాథను కొన్ని మార్పులతో గురజాడ అనుసరించారు. ఆదర్శప్రాయమైన మిత్రులు కాబట్టి, ఆ యిద్దరూ ఒకరికోసం ఒకరు సంతోషంగా చావడానికి సిద్ధమౌతారు. పితియన్ భార్య కూడా అలాగే ఆదర్శప్రాయమైంది అయినట్లు గురజాడ చిత్రిస్తారు. తన భర్తప్రాణం కాపాడడానికి ఆమె తనప్రాణం యిస్తానంటుంది. ఆ మైత్రి ఆ ప్రేమ వుదాత్తత చూసి సిరక్యూస్ రాజు డయోనిసియస్ ఆ మిత్రుల్లో ఒకరికి అంతకుముందు విధించిన వురిశిక్ష రద్దు చేస్తాడు. విషాదాంతం కాబోయే కథ సుఖాంతంగా మారుతుంది. కథలో యిమిడివున్న అనేకావకాశాలను గురజాడ సంపూర్ణంగా వినియోగించుకోలేక పోయారు. వుత్తేజం సూటిగా కలక్కపోవడం వల్ల మరికొన్ని సందర్భాల్లోలాగే, యిక్కడకూడా ఆయన ప్రతిభ సంపూర్ణంగా వికసించదు. ఇక, సాంప్రదాయిక కవులను అనుసరించినప్పుడు ఆయన సగటు కవులకన్న యేమీ మిన్నకాదు. తాను వాడుక భాషా, సరళమైన ఛందస్సూ వాడడం పాండిత్య లోపంవల్ల కాదని రుజువు చేయడానికి ఆయన సాంప్రదాయక ఛందస్సూ, పాతబడ్డ భాషలో 'సుభద్ర' రచిస్తే, అది మరీ చప్పగా తయారైంది. దాన్ని మధ్యలోనే ఆపెయ్యడానికి కారణం తనకే వెగటు కలగడం కావచ్చు.

ఆంగ్ల ప్రభావం మూలంగా మన రచయితల్లో ఆంగ్లంలో ఆలోచించి, ఆ భావాలను తమ మాతృభాషలోకి అనువదిస్తుంటారు. గురజాడ డైరీల్లో ఒకచోట యిలావుంది. ఆయన 1914 జనవరిలో కలకత్తాకు వెళ్ళినప్పుడు "రవీంద్రుని వంగభాష ఆంగ్ల నుడికారంలో వుంటుంది. అందువల్లే ఆయనకు పేరు రాలేదు." అని హరిప్రసాద్‌శాస్త్రి అన్నాడట. ఆ నాటికి, అంటే రవీంద్రునికి నోబెల్ బహుమతి రాకపూర్వం, ఆయన కవిత్వానికి, ఆ మాటకొస్తే ఆయన వచనానికి సయితం బెంగాలీల్లో, ముఖ్యంగా పండితుల్లో, ఛాందసుల్లో పేరురాలేదు. కానీ, రవీంద్రుని వంగభాషమీద హరిప్రసాద్ అంచనా సరైందోకాదో మనకు తెలియదు. అదేమైనా, యెంత రంధ్రాన్వేషులు కూడా గురజాడకు తెలుగు నుడికారం మీద వుండే ఆధిపత్యాన్ని తప్పులు బట్టలేరు. ఆయన రచనలోని అనన్య సాధ్యమైన సమ్మోహన శక్తికి, అజరామరమైన ప్రశస్తికీ కారణం ఆ ఆధిపత్యమే. నిజానికి,

తెలుగుభాషకు యెన్నో కొత్తపద బంధాలను, నుడికారాలనూ సృష్టించి యిచ్చిన ఘనతకూడా ఆయనకు దక్కింది. ఆయన స్పర్శ తగిలితే, మామూలు పదాలు కూడా కొత్త అర్థచ్ఛాయలనూ, కొత్త రాగస్వరాలనూ సంతరించుకుంటాయి.

వర్డ్స్ వర్త్‌ను గురించి రాస్తూ, రచయితకు 'అచంచలమైన విశ్వాస పునరుత్పాదకశక్తి' వుంటే తప్ప అతను సాహిత్యాన్ని కొత్తదారిలో నడపించ లేడని లూయీ కజామేన్ అంటాడు. "కవితోత్తేజాన్ని, భాషనూ సమూలంగా పునర్నవం చేయడానికీ, నిరంకుశ సంప్రదాయాన్ని ధ్వంసచేసి మంత్రకట్టును ఛేదించడానికి గరిష్ఠమైన నైతిక ధైర్యం" అవసరమని కూడా ఆతనంటాడు. ఈ 'అచంచల విశ్వాసం' మానవతావాదం తప్ప మరేదీ కాజాలదు. ఇక ఆయన నైతిక ధైర్యం 'మనిషి' అనే పేరుండే ఒక గేయంలో నిర్ద్వంద్వంగా ప్రకటిస్తారు. మనిషి మలచిన రాళ్ళకు దైవశక్తులున్నాయని భ్రమపడ్డం, వాటిని పూజించడమంటే ప్రాణంలేని రాళ్లస్థాయికి దిగడమేఅనీ, కొండల్లో కోనల్లో దేవునికోసం వెదకడం నిరర్థకమనీ, మానవసేవే అసలైనముక్తి మార్గమనీ. †

అసాధారణమైన విశ్వాసం, అసాధారణమైన నైతికధైర్యం వుండే కవి మాత్రమే ఆరు దశాబ్దాల క్రితం యిలా రాసివుండగలడు - తోడి మానవుల్ని కాక, రాళ్ళనూ, చెట్లనూ, పాములను, చతుష్పాత్తులనూ దేవతలుగా యెంచే మనషులమధ్య జీవిస్తూ.

---

† మనిషి చేసిన రాయిరప్పకి
మహిమ కలదని సాగి మొక్కుచు
మనుషులంటే రాయి రప్ప కున్న కనిష్ఠం..
గాను చూసా వేల బేలా?
దేవుడెవడో దాగెనంటూ
కొండ కోనల వెతుకులాడే
కన్ను తెరిచిన కానబడదో
మనిషి మాత్రుడి యందు లేడో!
యెరిగి కోరిన కరిగి యీడో ముక్తి"

(మనిషి గేయంలోంచి)

# 13. యాస సర్వం కవిత్వం

"యాస సర్వం రూపకం, రూపకమంతా కవిత్వం"

—జి. కె. చెస్టర్‌సన్

చెవిటి వాళ్ళకు వినబడాలంటే, బిగ్గరగా అరవాలి. ఆ చెవుడు తెచ్చి పెట్టుకున్నదైతే మరింత బిగ్గరగా అరవాలి. వ్యావహారిక తెలుగు వుద్యమ వ్యాప్తికోసం, గురజాడ తన వయోజన జీవితమంతా చేయవలసి వచ్చింది సరిగ్గా యిదే. యీనాడు యాసమాటగా వున్నదే రేపు ప్రామాణిక ప్రయోగం అవుతుందనీ, యెల్లుండి వాడుక దప్పిన మాట అవుతుందనీ సముచితంగా ఆలోచించే యే మనిషికైనా విశ్వాసం కల్గించడానికి యే సజీవ వర్ధమాన భాషా చరిత్రకైనా పై పైన పరిశీలిస్తే చాలు. ఇది అవిచ్ఛిన్న ప్రక్రియ, యిది రక్త ప్రసరణ లాంటిది. యీ ప్రసరణాన్ని ఆపడం అంటే, మృత్యువును లేదా అంతకన్నా ఘోరమైన పక్షవాతాన్ని కొని తెచ్చుకోవడమే. భాషా శాస్త్ర నిపుణుడూ, గొప్ప రచయితా అయిన లోగన్ పియర్సాల్ స్మిత్ (1865 - 1946) యీ విషయం మీద చెప్పింది:

> "రచయిత తన భాషను తాను సృష్టించుకోలేదు. సమాజం సమకూర్చిన దాన్నే అతను స్వీకరించాలి. అనుభూతి ప్రేరకమూ, అలంకార భూయిష్టమూ అయిన భాషకోసం అతను చేసే అన్వేషణలో సహజంగా అతను తాము కళాకారులం అని తెలియకుండానే తరతరాల ప్రజా కళాకారులు సృష్టించిన సంపన్నమయ సజీవ భాషను ఆశ్రయిస్తాడు. అక్కడ ఆతనికి శక్తిమంతమూ, సజీవమూ అయిన భాష లభిస్తుంది. అది అలంకారమయం, వ్యంగ విలసితం. జీవితమంటే వుత్సాహ సంతోష భరితం. యీ గుణాలు రచయితకు అమూల్యమైనవి, యీ వుత్సాహం, యీ కుతూహలం సహృదయమైన యేవగింపునూ, హాస్య పూరితమైన తిట్లనూ, వ్యక్తం చేసే వందలాది మాటల్లో, పదబంధాల్లో రూపు గట్టుకొని

వుంటుంది. ఆశ్చర్యాన్నీ, అబ్బురపాటునూ విస్మయాన్నీ తెలియజేసే పదాల్లో రూపుదాల్చి వుంటుంది. వాటి దుర్వారమైన వుత్సాహం మూలం. ఖండశక్తి మూలంగా వాటికుండే కేళీ విలాసం మూలంగా యెన్నో కింది తరగతి పదాలు మన డ్రాయింగు రూముల్లోకి ప్రవేశిస్తాయి. అయితే ప్రజాభాషలో మరొక గుణం సయితం వుంది. అదే వూహాశక్తి, కవిత్వమూ, సాహిత్య కారుసికి యిది యింకా విలువైంది కూడా. సంగీతకారులకు కార్మికుల గుడిసెల్లో అనియతంగా వికపించిన మనోజ్ఞ జానపద సంగీతం కన్పించినట్లు, ఆ గుడిసెల్లోనే అలాగే మనోజ్ఞ జానపద కవిత్వం కన్పిస్తుంది. ఊహ సంపన్నమైన భాష, సంగీతం లాగే ప్రజాజీవితం గుండెకాయ నుంచి పుట్టింది. అది పుట్టిన గడ్డలాగే చైతన్య వంతమైంది."

జి. కె. చెస్టర్‌టన్ (1874-1936) కూడా యిదే అంటాడు. కానీ, తన సొంత పద్ధతిలో అంటాడు. సూత్రప్రాయంగా చెప్పడం, విషమాలంకారాల్లో మాట్లాడ్డం, ముళ్ళువేయడం అతనికి మోజు. అందుకోసం అతను యాస యింకొక్క అడుగువేస్తే కవిత్వం అవుతుందని నవ్వులాటగా అంటాడు. కవిత్వం అన్నప్పుడు నాటకమూ, నవలా, కథానికా, వ్యాసమూ, నిజానికి యేనాడో చచ్చి యింకా సాహిత్యంగా చలామణి కావడానికి ప్రయత్నించేది తప్ప ప్రతి సాహిత్య ప్రక్రియా అతని మనసులో వుందని మనం విశ్వసించవచ్చు. చాసర్ నాటినుంచీ షేక్స్పియర్ నాటికీ, షేక్స్పియర్ నాటి నుంచీ షెల్లీ నాటికీ, షెల్లీ నాటినుంచీ ఎలియట్ నాటికీ ఆంగ్లభాష మారింది. మారడానికి దాని సంసిద్ధతే, అది ప్రపంచభాషగా అభివృద్ధి కావడానికి దోహదమైంది. మార్పు జీవలక్షణం. యిది మనిషికి యెంతగా వర్తిస్తుందో, మనిషి భాషకు కూడా అంతగానే వర్తిస్తుంది. భాషకు సంబంధించి దీన్నే 'భాషానిశ్రేణి' అని లోగన్ పియర్సాల్ స్మిత్ అనడం. మెట్లు యెక్కడం ద్వారా మాత్రమే అది మారగలదు :

"మనకు....కనీసం నాల్గురకాల ఆంగ్లం వుంది. ప్రతి రకానికి ప్రత్యేకమైన పద సముదాయం వుంది. నేలమీదనుంచీ కవిత్వపు యెత్తులదాకా వున్న యీ భాషానిశ్రేణిని పరిశీలిస్తే కిందిమెట్టు ప్రజాభాష, పామరభాష అనే నేలకు ఆనించి వుంటుంది. కారణం మన యాసమాటలూ, వాడుక పదాలూ దాదాపు అన్నీ

ప్రజలనుంచీ వచ్చినవే. వాటిలో చాల పదాలు మాండలికాలు. సన్నిహితుల సంభాషణలో అవి సులభంగా ప్రవేశిస్తాయి. క్రీడాకారులు అశ్వశిక్షకుల నుంచీ, యజమానులు శ్రామికుల దగ్గరనుంచీ, పిల్లలు సేవకుల దగ్గరనుంచీ నేర్చుకొంటారు. గుర్రపు శాలలనుంచీ, తోటల నుంచీ అవి డ్రాయింగు రూముల్లోకి ప్రాకుతాయి. విద్యావంతులూ, విద్యా విహీనులూ అరమరికలు లేకుండా కలసి మాట్లాడుకునేప్పుడు ప్రజా భాషలో తాజాగావుండే కొత్త పదాలు విద్యాధిక వర్గాల పద జాలంలో చేరతాయి. ఈ పదాలు పడికట్టు మాటలనుంచీ వచ్చినా, యాస నుంచీ వచ్చినా, మాండలికం నుంచీ వచ్చినా మొదట పామర భాషా పదాలుగా పరిగణింపబడి, శిష్టుల నాజూకు చెవులను అదర గొడతాయి. త్వరలో వాటికి జల్లెడ పట్టడం జరుగుతుంది. యాస మాటలు సాధారణంగా వస్తువులను నిర్వచించడానికి కాక, వాటిని గురించి యేదైనా హాస్యంగా చెప్పేందుకు సృష్టింపబడతాయి. కాబట్టి తప్పనిసరిగా తమ యాస స్వభావాన్ని నిలుపుకుంటాయి. అచ్చమైన, వుపయోగ కరమైన నిర్వచనాలుగా వుండే మాండలిక పదాలు కొద్ది కొద్దిగా తను పామర సాంగత్యాలను పోగొట్టుకుంటాయి. భాషా నిశ్రేణిలోని కింది మెట్టుమీద స్థిరంగా అతుక్కున్న తర్వాత అవి ఒక్కొక్క మెట్టేపైకి వెళతాయి. వాటిని మొదట సంభాషణలో, తర్వాత పరిచితులకు రాసే వుత్తరాల్లో, ఆ తర్వాత సులభవచనంలో వాడతారు. వాటిలో కొన్నైనా అత్యున్నత కవితా పదజాలంలోకి ప్రవేశిస్తాయి.''

యిదంతా ఆంగ్లానికే కాదు, అన్ని భాషలకూ వర్తిస్తుంది. అవి సజీవంగా వుండాలనీ, అభివృద్ధి చెందాలనీ అనుకుంటే, తెలుగు సజీవంగా వుండాలనీ, అభివృద్ధి చెందాలనీ గురజాడ గాఢంగా ఆవేశపూరితంగా అభిలషించారు. వాడుక భాష అని ఆయన దేన్ని అన్నారో దాన్ని, ప్రచారం చేయడానికి ఆయన వుద్యమం నడిపారు. దాన్ని వుద్యమం అనడం కంటే పవిత్రయుద్ధం అనడం బావుంటుంది. యీ పవిత్ర యుద్ధంలో ఆయనకు అత్యంత సన్నిహితమైన, అత్యంత స్థిరమైన పొత్తుదారుడు ఆయన చిన్ననాటి నేస్తం గిడుగు వేంకటరామమూర్తి. వాళ్ళకు అపుడపుడు అండదండగా నిలిచిన వాళ్ళు కొద్దిమంది వున్నారు. వాళ్ళలో మరీ ప్రసిద్ధుల్లో యిద్దరు విశాఖపట్నం

ప్రాంతం పాఠశాలల యిన్స్పెక్టరు జె. ఎ. యేట్స్, విశాఖపట్నంలోని ఎ. వి. యన్. కళాశాల ప్రిన్సిపాలు పి. టి. శ్రీనివాస అయ్యంగారు. వీళ్ళకు యెదురుగా మోహరించింది, పండితులతో పండిత పోషకులతో ఛాందస పండితులతో వాళ్ళ శిష్యులతో యేర్పడిన మొత్తం అక్షౌహిణులు. వాళ్ళ నాయకులు జయంతి రామయ్య, వేదం వెంకటరాయశాస్త్రి, కొక్కొండ వెంకటరత్నం, కందుకూరి వీరేశలింగం వంటి కాకలు దీరిన యోధులు; చిత్రంగా సి. ఆర్. రెడ్డి కూడా. అది సుదీర్ఘమైన పోరాటం, సడలు బాటు లేని పోరాటం, యెన్నో రెట్లు బలంవుండే శత్రువులతో పోరాటం, అయినా, గురజాడ యెప్పుడూ తొణకలేదు. ఒక్క అంగుళం సయితం వెనకడుగు వేయలేదు. ఆయనకు తెలుసు వివేచనశక్తి తన పక్కనవుందనీ, చారిత్రక శక్తులు తనకు అండగా వున్నాయనీ.

'కన్యాశుల్కం' మొదటి కూర్పు ప్రచురణలో గురజాడ వాడుక భాష తరపున పవిత్రయుద్ధం ఆరంభించాడు. 1897 లో అచ్చయిన ఆ నాటకానికి రాసిన ముందు మాటల్లో ఆయన అన్నారు కదా :

"గ్రామ్యభాష అని తప్పుడు పేరు పెట్టినదాన్ని వాడడంవల్ల సాహిత్య రచనా గౌరవానికి భంగం వాటిల్లుతుందని అనే వాళ్ళున్నారు. భాషల నాణ్యాన్నీ, ప్రయోజనాన్నీ నిర్ణయించడానికి సనాతన భాషా సాంప్రదాయానికి సంబంధించిన వైయాకరణుల చాపల్యాల కంటే మేలైన ప్రమాణాలు భాషాశాస్త్ర పురోగతివల్ల యేర్పడ్డ యీ రోజుల్లో, ఆ విమర్శను మనం ఖాతరు చేయనక్కరలేదు. గణాల మీదా, యతిప్రాసలమీదా ఆధారపడినా, పద్యరచనా పద్ధతికి అవసరమైనందువల్ల తెలుగు సాహిత్యభాషలో అనేక వ్యాకరణరూపాలూ, అసాకర్యమైనంత విస్తార సంఖ్యలో పాతబడిన పదాలూ, యిష్టారాజ్యంగా కుదించిన పదాలూ, సాగదీసిన పదాలూ వున్నాయి. యెన్నంటే అన్ని సంస్కృత పదాలను ప్రవేశపెట్టే హద్దులేని స్వేచ్ఛను కవులు ఆత్రంగా వినియోగించుకొని, నిఘంటువుల సాయంతో చిత్రవిచిత్రమైన సమాస కల్పనలో ఒళ్ళుమరచి తెలుగు సాహిత్య మాండలికాన్ని చచ్చినదాన్నే మళ్లీ చంపారు. భాషా సంస్కరణ సమస్యను వివరించడానికి యిది సందర్భంకాదు. కానీ

యింతమాత్రం చెప్పవచ్చు. తెలుగు సాహిత్య మాండలికాన్ని గొప్ప నాగరికతా ప్రదాతగా చేయాలనుకుంటే దాన్లోనుంచీ అనవసరమైన మాటలనూ సంస్కృత శబ్దాలనూ తొలగించి దాన్ని వ్యవహార మాండలికానికి సన్నిహితంచేసి, అందులోని పదాలతో సుసంపన్నం చేయాలి. తెలుగుదేశంలోని వివిధ ప్రాంతాల్లో మామూలుగా మాట్లాడే తెలుగులో మాండలిక భేదం పెద్దగాలేదు. కాబట్టి సమర్థులైన రచయితలు పూనుకోవాలేగానీ, ఒక కొత్త, వుమ్మడి సాహిత్య మాండలిక భాషను సులభంగా నెలకొల్పవచ్చు."

దీన్ని గురజాడ యుద్ధ ప్రకటనగా పండితులూ, ఛాందస పండితులూ గ్రహించలేదు. సాంఘిక హాస్యనాటకానికి వాడుకభాష అత్యంత వుచితమైనందువల్లనే ఆయన వీరేశలింగంలా, వెంకటరాయ శాస్త్రిలా ఆ భాషను వాడారకి వాళ్ళనుకున్నారు. కురువృద్ధులు 'కన్యాశుల్కం' మొదటి కూర్పు మీద దాడిచేసి, దాన్ని చీల్చి చెండాడక పోవడానికి అదే ప్రధానకారణమని మనం భావించాలి. కానీ, 1909లో ఆ నాటకం రెండోకూర్పు వెలువడేటప్పటికి, రాసేది సాంఘిక నాటకమైనా, కావ్యమైనా, తాత్త్వికగ్రంథమైనా, యేదైనా వాడుకభాషకు సాహిత్య స్థాయి కల్పించడానికి గురజాడ పోరాడుతున్నాడని స్పష్టమైంది. దీంతో ప్రగతి నిరోధకశక్తులు మేల్కొని శివాలెత్తి కయ్యానికి కత్తులు దూశాయి. నిజానికి అంతకంటే భిన్నంగా జరుగుతుందని మనం వూహించలేము. ప్రామాణిక తెలుగు అని వాళ్ళు అనే దానిలో వాళ్ళస్వార్థం యిమిడివుంది. అది జీవితంనుంచి యెంతగా వేరుపడిందంటే, అందులో కొంతయినా పాండిత్యం సంపాయించడానికి దాన్ని యేళ్ళతరబడి అధ్యయనం చేయాలి. అగ్రవర్గాలు మాత్రమే ఆ పని చేయగలవు. అందువల్ల ప్రజలు నిరక్షరులుగా వుంచడానికీ వాళ్ళ మనస్సులను సమర్థంగా అదుపు చేయడానికీ ఆ వర్గాల చేతుల్లో అది మంచి సాధనంగా వుండగలదు. అమెరికాకు చెందిన లియొనార్డ్ బ్లూమ్‌ఫీల్డ్ అనే భారతీయ అధ్యయనవేత్త గాఢమైన సంస్కృత భాషాభిమాని. పాణిని వ్యాకరణం మీద ఆయనకు యెంత గౌరవమంటే, "మానవ మేధస్సు సృష్టించిన మహోన్నత నిర్మాణాల్లో అది ఒకటి" అని దాన్ని ఆయన అభివర్ణించారు. "యీ నాటివరకూ" యే భాషకూ అంత నిర్దుష్టమైన వ్యాకరణం లేదని ఆయన అభిప్రాయం. ఆ మహా నిర్దుష్టమైన, మహా కఠినమైన, క్లిష్టమైన

వ్యాకరణం మూలంగా సంస్కృతం "కాలక్రమంలో బ్రాహ్మణ భారత దేశానికంతటికీ అధికార భాషా, సాహిత్య భాషా" అయింది. తన పవిత్ర యుద్ధం ప్రారంభించడంలో గురజాడ లక్ష్యం సంస్కృతం లాగే తెలుగు కూడా అగ్రవర్గాల చేతుల్లో దోపిడీ సాధనం కాకుండా నివారించడం. యీ విషయంలో తన కుండే భయాన్ని ఆయన 'కన్యాశుల్కం' రెండో కూర్పుకు రాసిన ముందు మాటలో స్పష్టంగా వ్యక్తం చేసారు. ఆయన మాటల్నే చూడండి :

"నా దృష్టిలో తెలుగు సాహిత్య మాండలికం తెలుగు వాళ్ళమీద సంప్రదాయం విధించిన పెద్ద గుదిబండ. సంకెళ్ళను ప్రేమించే వాళ్ళు దాన్ని ఆరాధించనీయండి. నాకు కావలసింది నా దేశ భాష, సజీవమైన తెలుగు భాష. ప్రాచ్య ప్రపంచపు యిటాలియన్‌గా పేరు పొందిన భాష. ఈ భాషలో మన కష్ట సుఖాలు వెళ్ల బోసుకోవడానికి మనం యెవళ్ళమూ సిగ్గుపడం. కానీ దీనిలో బాగా రాయడానికి మనలో కొందరు సిగ్గుపడతారు. దేశభాషలో రచించే సాహిత్యం రైతులకు దగ్గరగా వుంటుంది. భారత దేశంలోని ఆంగ్లేయులకు దగ్గరగా వుంటుంది. దానికుండే అవకాశాలు అపారమైనవి."

గురజాడ రాసిన సుమారు డజను వ్యాసాల్లో దాదాపు సగం సాహిత్య భాషకూ, వాడుక భాషకూ సంబంధించినవి. గొప్ప పాండిత్యం మీద ఆధారపడిన యీ వ్యాసాల్లో, చమత్కారమూ, హాస్యమూ, ఎగతాళీ వున్నాయి. శత్రువుల మీద బలంగా దెబ్బ తీసినప్పటికీ వీటిలో కోపమూ, ద్వేషమూ లేవు. తిట్లతో వెకిలిగా రాసిన ఆకాశ రామన్నకు ఆయన యెంత హాస్యంగా నవ్వు పుట్టించేటట్లు జవాబిచ్చినాడంటే, యీనాడు కూడా అది మనకు కడుపు చెక్కలయ్యేట్లు నవ్వు పుట్టిస్తుంది. మొత్తం వ్యాసాల్లో కల్లా యిది వుత్తమ మైందనీ, మార్క్ ట్వెయిన్ కూడా గర్వించదగినంత శ్రేష్ఠమైందనీ చెప్పవచ్చు.

మద్రాసు విశ్వ విద్యాలయంలో ఫెలోగా వుండటమే గాక యితర విధాల కూడా తన జీవితం చివరి దశాబ్దంలో గురజాడకు ఆ విశ్వ విద్యాలయంలో సన్నిహిత సంబంధం యేర్పడింది. దీనిద్వారా ఆయనకు శత్రు

శిబిరంలోనే పోరాటం చేయడానికి వీలు కలిగింది. తన సహయోధుడయిన గిడుగు వేంకటరామమూర్తికి 1913 లో రావు సాహెబ్ బిరుదు లభించినపుడు గురజాడ అమితానందం పొంది సంవత్సరారంభదినాన తన డైరీలో యిలా రాసుకున్నారు :

"రామమూర్తి రావు సాహెబ్ కావడం చాల సంతోషకరం. ఆనరబుల్ (మోచర్ల) రామచంద్రరావు కాస్మాపాలిటన్ క్లబ్బునుంచి ఫోన్‌చేసి, యిది మన వుద్యమానికి విజయం అన్నారు."

ఆ యిద్దరు యోధులకు రెండు పర్యాయాలు విజయం లభించినట్లు కనిపించింది. యస్. యస్ యల్. సి. పరీక్ష రెండో భాగంలో ఇంగ్లీషులో యిచ్చే ఖండికను అనువాదం చేసేటప్పుడు విద్యార్థులు పాతతెలుగును కానీ కొత్త తెలుగును కానీ, దేన్నయినా వాడవచ్చునని 1912 లో యస్. యస్ యల్. సి. బోర్డు సెక్రటరీ సర్క్యులర్ జారీ చేశారు. ఇది పాక్షిక విజయం మాత్రమే. అయినా ప్రతిపక్షుల దుర్గంలో యిది మంచి గండి కొట్టింది. తర్వాత ముందడుగును జి. వి. సీతాపతి యిలా వర్ణించారు :

"డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ యిన్‌స్ట్రక్షన్ కోరినందువల్ల ఎఫ్. ఎ; బి.ఏ. విద్యార్థుల వ్యాస రచనలో, అనువాదంలో వాడుక భాష వాడడానికి అనుమతి యివ్వడం మంచిదో కాదో మద్రాసు విశ్వవిద్యాలయం పరిశీలించ వలసి వుంది. ఈ వివాదం దృష్ట్యా యే విధానం అవలంబించవలసిందీ సూచించడానికి విశ్వ విద్యాలయం తెలుగు అనువాదం వ్యాసరచన కమిటీని నియమించింది. కమిటీలో పాత తెలుగుకు ప్రాతినిధ్యం వహించడానికి నలుగురు సభ్యులూ, కొత్త తెలుగుకు ప్రాతినిధ్యం వహించడానికి నలుగురు సభ్యులూ వున్నారు. మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీకి చెందిన ప్రొ॥ యం. రంగాచారిని అధ్యక్షులుగా నియమించారు. అధ్యక్షుని నిర్ణాయక ఓటు సహాయంతో గ్రంథాలలో వుపయోగించే రూపాలనూ, మాట్లాడేటప్పుడు వుపయోగించే రూపాలనూ రెంటినీ ఇంటర్మీడియెట్ వ్యాసరచనలో ప్రమాణంగా గుర్తించవచ్చు అని కొత్త తెలుగుకు అనుకూలంగా తీర్మానం చేయడమయింది."

యుక్తితో కూడిన కుతంత్రాన్ని వినియోగించుకొని తద్వారా రాయలసీమ నుంచీ కో అప్ట్ చేసుకోబడిన సభ్యుల సహాయంతో ప్రతిపక్షులపై కమిటీ

సిఫారసును తమకు అనుకూలంగా మార్పించుకున్నాయి. పరిస్థితిని సాను కూలం చేసుకోడానికి గురజాడ ధైర్యంగా ప్రయత్నం చేస్తూ వాదనా పటిమతో కూడిన బృహత్తరమైన డిసెంట్ పత్రం రాశారు. కానీ అది వుపయోగ పడలేదు. 'కొత్త తెలుగు అనేదాన్ని అంగీకరించడం యిప్పుడు సాధ్యం కాదు' అని మద్రాసు విశ్వ విద్యాలయం ప్రకటింపవలసి వచ్చింది.

ఆ ప్రకటనలోని 'యిప్పుడు' అనేది కొన్ని సందర్భాల్లో చివరి యాభైలదాకా మరికొన్ని సందర్భాల్లో తొలి డెభ్భైల దాకా కొనసాగిందంటే దాని కత్యంత ముఖ్యమైన కారణం ఆంధ్ర దేశంలోని విశ్వ విద్యాలయ విద్యమీద సి. ఆర్. రెడ్డికి వుండే ప్రబలమైన ప్రభావమే. ఆయన సాంఘిక ఆర్థిక రంగాల్లో తీవ్రవాది. రాజకీయ రంగంలో వుదారవాది. సాహిత్య రంగంలో ముందు చూపున్న వ్యక్తి. కాని భాష విషయం వచ్చేటప్పటికి కరడు గట్టిన యథాస్థితి వాది. వాడుక భాషను మొదట వ్యతిరేకించిన వీరేశలింగం తన మరణానికి సంవత్సరం ముందు ఆ భాషకు అనుకూలంగా మారారు. కానీ, సి. ఆర్. రెడ్డి యే దశలోనూ మారలేదు. ఆయన కేంబ్రిడ్జ్ విశ్వ విద్యాలయంలో వున్నత విద్య అభ్యసించి హిస్టరీ ట్రైపోస్‌లో ప్రథమ శ్రేణి పొందారనే విషయం పరిగణనలోకి తీసుకుంటే, వాడుక భాషపట్ల ఆయన యావజ్జీవిత వ్యతిరేకత దృష్టి దోషంవల్ల యేర్పడింది అని అనుకో వాలి. యేదో ఒక విషయంపట్ల దృష్టి దోషంలేని దెవరికి? యేమైనా రామయ్యలూ రెడ్లూ వ్యతిరేకించి నప్పటికీ వాడుక భాష విజయంపొంది యిద్దరు మహా దీర్ఘదర్శుల జీవిత కృషికి సాఫల్యం చేకూర్చింది. తెలుగు భాషా గగనతలంలో వాళ్లు రెండు ధ్రువ నక్షత్రాల్లా శాశ్వతంగా ప్రకా శిస్తారు.

# 14. బంగారు లోకాలు

"యెంతో పయనించా బంగారు లోకాల్లో"

— కీట్స్

గురజాడ డైరీల్లో, నోటుపుస్తకాల్లో యెంత విస్తారమైన ప్రపంచం, యెంత వైవిధ్య పూరితమైన లోకం మనకు కన్పిస్తుందని? అవి అసంపూర్ణంగా వున్నా, వాటిని సరిగ్గా భద్రపరచక పోయిన వాటిలో మనకు రక రకాల మనుషులు యెదురవుతారు, రక రకాల భావాలు కన్పిస్తాయి. రక రకాల దృశ్యాలూ, ధ్వనులూ, వాసనలూ ప్రత్యక్షమవుతాయి; స్వప్నాలూ అతీంద్రియ దృశ్యాలూ కన్పిస్తాయి. రాకుమారులూ, రాకుమార్తెలూ తగుల్తారు, వాళ్ళతోపాటు నిరుపేదలు సయితం. పడుపుకత్తెలూ, వాళ్ల పోషకులు మన కంట బడతారు—వాళ్లచుట్టు తిరిగే తార్పుడు కత్తెలతో సహా. వంటవాడు, పనిమనిషి, అంతరంగిక పరిచారకుడు, మావటీడు, కసువు జిమ్మేవాడు, చాకలి—యెవరూ తప్పిపోరు. వంగివంగి సలాములు జేసే రాజాశ్రితుడు, ముఖస్తుతి పరాయణుడైన కవి, భేషజ పండితుడు, లంచగొండి వుద్యోగి, పొగరు బుర్రా సాహెబ్, ఆడంబర పరుడైన సైన్యాధికారి, పటాటోపం గవర్నరు—సర్వులూ మన కళ్ళముందు కవాతు చేస్తూ దర్శనమిస్తారు.

డైరీలుగానీ, నోటు పుస్తకాలుగానీ సంపూర్తిగా లేవు. డైరీలు 1889 నుంచీ మాత్రమే లభ్యమయ్యాయి. అవికూడా 1907-1913 మధ్యలేవు. నోటు పుస్తకాల్లో తేదీలు మృగ్యం. వాటిలో కొన్ని నష్టమయ్యాయేమో చెప్పలేము. అసంఖ్యాకమైన ఆయన వుత్తర ప్రత్యుత్తరాల్లో మనకు మిగిలింది అణుమాత్రం. ఆయన సొంతపుస్తకాలు చెల్లా చెదురయ్యాయి. అందువల్ల పుస్తకాల మార్జిన్లలో ఆయన రాసుకున్న విస్తారమైన వ్యాఖ్యలు మనకు లభ్యంకావు. అంతకంటే విచారకరం యింతవరకు భద్రపరచబడ్డ సమాచారానికైనా సరిగ్గా ప్రతులు రాయడం, పరిష్కరించడం, ప్రచురించడం జరుగలేదు; అంతాఆంగ్లంలోనే, యెక్కడో ఒక మాట లేదా ఒక పదబంధం లేదా ఒక వాక్యం తెలుగులో జీవం తొణికిసలాడే గురజాడ మూర్తిని అచ్చంగా,

సమగ్రంగా దర్శించాలంటే, ఆయనెంతటివాడో గ్రహించాలంటే, ప్రచురిత మైన రచనలకన్నా ఆయన డైరీలూ, నోటు పుస్తకాలూ, లేఖలూ యెక్కువ వుపయోగం. ఆయన చురుకుగా సృజనాత్మక రచనలు చేసినకాలం చాలా తక్కువ—1907-1915 మధ్యకాలం మాత్రమే. ఆ తొమ్మిదేళ్ళ స్వల్ప కాలంలో ఆయన మనకు యిచ్చిపోయింది తన మనసులో పథకం వేసు కున్న దాంట్లో అల్పభాగం మాత్రమే. వివిధ బ్రహ్మాండ పథకాలనేకం వేసు కున్నట్లు ఆయన డైరీలూ, నోటు పుస్తకాలూ, వుత్తరాలూ తిరుగులేని సాక్ష్యం చెబుతున్నాయి.

గురజాడ కున్నంత గ్రంథ పరిచయం ఆనాటి తెలుగు రచయితల్లో యెవరికీ లేదు. భారతీయ సాహిత్యంలో గానీ, ప్రపంచ సాహిత్యంలో గానీ ముఖ్యమైనదేదీ ఆయన దృష్టిని తప్పించుకో లేదు. రవీంద్రనాథ టాగూరు (1861-1941)ను ఆయన కలుసుకున్నారు; చర్చలు జరిపారు; వుత్తర ప్రత్యుత్తరాలు నడిపారు. జాతీయ జీవనంలోని ప్రముఖులతో గురజాడ సంపర్కం పెట్టుకున్నారు. హరిప్రసాద్ శాస్త్రితో, అశుతోష్ ముఖర్జీతో, గురుదాస్ బెనర్జీతో, బెంగాల్‌లోని యితర ప్రముఖ రచయితలతో, ఆలోచన శీలురతో ఆయనకు మైత్రీ సంబంధాలున్నాయి. ఆంధ్ర కర్నాటక తమిళ నాడుల్లోని భాషా శాస్త్రజ్ఞులతో, శాసన పరిశోధకులతో, పురాతత్వ శాస్త్ర వేత్తలతో, విద్యావేత్తలతో, నాటక రచయితలతో ఆయనకున్న సంబంధాలు యెంతో సన్నిహితమైనవి. ఆయనకు ఆసక్తివున్న విషయాలు మరీ విస్తారం. వ్యవసాయం మొదలుకొని జ్యోతిశ్శాస్త్రం దాకా, అభినయం మొదలుకొని చరిత్రదాకా, ఆయన మనోరంగం ప్రవేశించని విషయం లేదు. జీవితాన్ని అర్థం చేసుకోడానికే గాక, జీవితాన్ని వ్యాఖ్యానించడానికీ, దానికి అందాలు చేకూర్చడానికీ, ఒక కొత్త ప్రమాణాన్ని సమకూర్చడానికీ, ఒక్క మాటలో చెప్పాలంటే, జీవితాన్ని మరింత సుఖప్రదమూ, సృజనాత్మకమూ, అర్థ వంతమూ చేయడానికి తృప్తి యెరగని ఆయన తృష్ణ యెలాంటిదంటే చిట్టి పొట్టి రచనలూ, గల్పికలూ, కథానికలూ, నవలలూ, నవలికలూ, నాట కాలూ, నాటికలూ, జీవిత చరిత్రలూ, దేశ చరిత్రలూ, విమర్శా రాయడానికి ఆయన పథకాలు వేసుకొన్నారు. ఈ విస్తారమైన రచనలకు కావలసిన వివరాలన్నీ ఆయన తన డైరీల్లో, నోటు పుస్తకాల్లో గుర్తు పెట్టుకున్నారు. కాస్తా ఆరోగ్యమూ, మరికాస్తా ఆయుస్సూ లభించి వుంటే, ఆయన మనకు

మరింత విస్తారమైన, మరింత సంపన్నమైన, మరింత దేదీప్యమానమైన ఆస్తి యిచ్చి వెళ్ళేవారు.

కవిగా, నాటక రచయితగా, కథానికా రచయితగా, వ్యాస రచయితగా తన స్థానం అమర రచయితల మధ్యవుందని గురజాడ పుష్కలంగా రుజువు చేసుకున్నారు. ఆయన నవలలు రాసివుంటే, ఆ రంగంలో సయితం అత్యున్నత ప్రమాణాలు నెలకొల్పి వుండేవారని డైరీల్లో, నోటు పుస్తకాల్లో వున్న కొన్ని ఆరోపాలబట్టి చెప్పవచ్చు. 1895 మే 2 వ తేదీనాటి ఆయన డైరీలో చాలా అర్థవంతమైన వ్యాఖ్య ఒకటుంది: "రెయ్‌నాల్డ్స్ నవలలు సిగ్గుచేటు" అని యీ వ్యాఖ్య పూర్తి ప్రాముఖ్యం తెలుసుకోవాలంటే మరాఠీ, హిందీలాంటి కొన్ని భారతీయ భాషల్లోని తొలి నవలా కారులంతా క్షుద్రావేశ పూరితమైన కథలురాసే చౌకబారు రచయితగా, తన దేశంలో దాదాపు బొత్తిగా నాంనిశానీ లేని వాడూ అయిన జి. డబ్ల్యు. యం. రెయ్‌నాల్డ్స్ నుంచీ వుత్తేజం పొందారనే విషయం చెప్పవలసి వుంటుందేమో! సర్‌వాల్టర్ స్కాట్ (1771-1982) ను ఆదర్శంగా తీసుకోడానికి కూడా గురజాడకు తీవ్రమైన సందేహాలున్నాయి. బంకిం చంద్ర చటర్జీ రాసిన కొన్ని చారిత్రక నవలల మీద గురజాడ విమర్శనాత్మకమైన అంచనాలను బట్టి యీమాట చెప్పవచ్చు. ఇది నిరాధారమైన వూహ కాదు. ఆయన రాయ తలపెట్టిన ఒక నవలకోసం ఒక క్రమం లేకుండా ఆంగ్లంలో రాసుకున్న నోట్సు ఆయన వదలిపోయిన అప్రచురిత పత్రాల్లో వుంది. ఆ నవలలలో భోగంపడుచు కథానాయిక. ఆమెను పెళ్ళి చేసుకోవాలనుకున్న ఆదర్శవాది కథానాయకుడు. ఆ నవల లోని అనేక పాత్రల్లో ఒక మత గురువూ, ఒక ప్రొఫెసరూ వున్నారు. నవలకు నిండుతనం యివ్వడానికి గిరీశం సయితం వున్నాడు. ఈ అందరితో ఆ నవలకు ఆధునిక మహాకావ్యం కాగల లక్షణాలన్నీ వున్నాయి.

చరిత్ర కారుడుగా కూడా గురజాడ తప్పకుండా పేరు తెచ్చుకొని వుండేవాడు. కళింగ చరిత్రకోసం ఆయన చేసిన పరిశోధన విస్తృతమైందీ, అతిశ్రద్ధాయుతమైందీ. భారతదేశంలో లభించే సమాచారమంతా సేకరించిన తర్వాత ఆయన పారీస్ పబ్లిక్ లైబ్రరీలో అదనపు సమాచారమేమైనా దొరుకుతుందేమోనని ఫ్రాన్సుకు వుత్తరం రాశారు. పారీస్ విశ్వ విద్యాలయంలోని ఒక ప్రొఫెసరుకు కూడా రాశారు. నిజానికి 'కళింగదేశ చరిత్రను' ప్రచురించ

బోతున్నట్లు విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి ప్రకటించింది. కానీ, గురజాడ ఖచ్చితంగా గ్రాంథిక భాషలో రాయాలని ఆ సంస్థ ప్రధాన సంపాదకుడు పట్టుబట్టాడు, అలాంటి పుత్తరువులకు లోబడడం యిష్టంలేక గురజాడ తన గ్రంథరచన మానుకున్నారు. దాదాపు ఆ కాలంలో ముని సుబ్రహ్మణ్యానికి రాసిన జాబులో ఆయన వాడుక భాషమీద తనకున్న విశ్వాసాన్ని పునరుద్ఘాటించారు :

"నా వుద్యమం ప్రజల వుద్యమం. సంస్కార వంతుల అభిప్రాయం నాకు అండగావుంది. విషయం అర్థం చేసుకోలేని వాళ్ళు నాకు వ్యతిరేకంగా నిలబడితే నేను లెక్క చెయ్యను. వాళ్ళు మారినా, భాషకేమీ మేలు జరుగదు. వాళ్లు యెంతో కృత్రిమమైన పాత గ్రాంథిక భాషకు యే ఆశాలేకుండా అంటి పెట్టుకొని వున్నారు. నీలాంటి యువకులు శిష్ట వ్యవహారిక భాషలో మంచి రచనా సంప్రదాయం సృష్టించాలని నా కోరిక."

గురజాడ ఆసక్తి ప్రజల భాషపట్ల మాత్రమే కాదు. తన తరం, రాబోయే తరాల జీవితానికి, యోచనకూ సంబంధించిన ప్రతి మౌళిక సమస్య పట్ల ఆయనకు ఆసక్తి వుండేది. 1901 ఆగష్టు 9 నాడు తన డైరీలో ఆయన రాసుకున్న సుదీర్ఘ ఆరోపంలో కొంతభాగం యిది:

"తూర్పు యూరప్‌లోని ఒక జాతిని గురించి ఫ్రీమన్† అన్నట్లు మన వాళ్ళను గురించి నే నిలా అనవచ్చు. సామరస్యం సాధ్యంకాని విభేదాలున్న రెండు నాగరికతలను నేటి తరంవాళ్లు ప్రత్యక్షంగా చూస్తున్నారు. అందులో ఒకటి పురాతనమైందీ, రాజీపడనిదీ: కానీ తన స్వీయ సంకుచితత్త్వం మూలంగా, తన ప్రతినిధుల హీన సామాజిక స్థానం కారణంగా ఆ ప్రతినిధులు పరాయి విశ్వాసాల, పరాయి పద్ధతుల వెల్లువను చురుకుగా యెదిరించడానికి అశక్తులు. మరొక నాగరికత ప్రగతి మూలంగా, స్వేచ్ఛ మూలంగా బలీయమైంది, వివేచన శక్తిమీద ఆధారపడినందువల్ల దుర్వారమైంది.

"పాశ్చాత్య నాగరికత విశ్వాసాలను ధ్వంసం చేసేది. స్వేచ్ఛను వుపకారంగా చేసే సామాజిక ప్రగతీ, సర్దుబాటూ లేకుండా స్వేచ్ఛను

† యీ ఫ్రీమన్ 'సిసిలీ చరిత్ర' రాసిన ఎడ్వర్డ్ అగస్టస్ ఫ్రీమన్ కావచ్చా?

నేర్పే ఆ నాగరికత అసంగతాలకూ, తప్పులకూ, సాకులకూ తప్ప కుండా దారితీస్తుంది. ఈ ధోరణితో సమర్థంగా పోరాడడం యీ నాటి విద్యా సమస్యల్లోకెల్లా ప్రముఖం—''

గురజాడ డైరీల్లో, నోటు పుస్తకాల్లో లేదా ఆయన లేఖల్లో యిలాంటి భాగం యిదొక్కటే కాదు. సమకాలిక ప్రాముఖ్యముండీ, యింతకంటే నిశితమైనవీ, గాఢ పరిశీలనాత్మకమైనవీ డజన్లకొద్దీ వున్నాయి. చిన్న చిన్న బంగారుముద్దలు సయితం సమృద్ధిగా వున్నాయి: ''మద్యం మనిషిలో స్నేహభావమూ, ఔదార్యమూ కల్గిస్తుంది.'' అనేది ఒకటి. ''ప్రకృతి సిద్ధ మైన వస్తువులకూ, స్మృతులకూ, వ్యక్తులకూ అజ్ఞాతాంశం ఆకర్షణనూ, ఆసక్తినీ, సమ్మోహక శక్తినీ ప్రసాదిస్తుంది.'' అనేది మరొకటి. ''ఒక మనిషిని ఒకప్పుడు పైకెత్తి, మరొకప్పుడు నిర్లక్ష్యం చేయడం అనే పొరపాటు చేయకు'' అని మూడోది హెచ్చరిస్తుంది. రచయితలకు ప్రత్యేకాసక్తి వుండేది నాల్గోది. ఇలా, భారతదేశంలోని మామూలు పండితునికి అనేక శాస్త్రాల్లో చాలాకాలం వరకు అనుకరించడానికీ, అనువదించడానికీ మాత్రమే అవ కాశం వుంది. తర్వాతది యిలా చెబుతుంది. ''దుష్టవాంఛలనుంచీ విముక్తి పొందితే అద్భుతశక్తి లభిస్తుంది.'' ఆరోది యీ డైరీలోని పెళుసుబారిన కాగితాల్లోంచీ మెరుస్తుంది. ఏడోది ఆ నోటు పుస్తకాల్లోని చిరిగిపోతున్న కాగితాల్లోంచీ మిలమిల లాడుతుంది. మరొకటి ఒక వ్యక్తిగతమైన లేఖలోని ఆత్మీయతల మధ్యనుంచీ తళతళమంటూ మన దృష్టిని ఆకర్షిస్తుంది. ఇవన్నీ చదువుతూపోతే ''బంగారు లోకాలు'' ద్వారా పయనిస్తున్న భావం మనకు కలుగుతుంది.

# 15. కాంతి రేఖ

"అవనీతలం పొడవునా కాంతిరేఖ"

—టెన్నిసన్

భారతదేశంలో బాగా దుర్వినియోగమయ్యే మాటల్లో ఒకటి "పున రుజ్జీవన యుగ మానవుడు" "పునరుజ్జీవనం" మాటకున్న సరైన అర్థంలో, పూర్తి అర్థంలో మనమింకా పునరుజ్జీవనాన్ని సాధింపవలసి వుంది. యూరప్‌లో పునరుజ్జీవనానికి చెందిన మసక వెలుగులు పద్నాలుగో శతాబ్ది మధ్యలో ప్రారంభమై, పదారో శతాబ్ది అంతానికల్లా దేదీప్యమానంగా ప్రకా శించాయి. మనదేశంలో కూడా పంతొమ్మిదో శతాబ్ది పుత్తరార్ధంలో పునరుజ్జీవ నానికి చెందిన మసక వెలుగులు ప్రారంభమైన మాట నిజమే. కానీ, అవి యింకా మసక వెలుగులుగానే వున్నాయి. కాలం గడిచేకొద్దీ వాటి ప్రకాశం పెరగడానికి బదులు తరగిపోతోంది. ఈ వాస్తవం యెంత చేదుగావున్నా, దీన్ని అంగీకరించక పోవడమంటే, పునరుజ్జీవన మనే మాట మనకు అర్థం కాలేదని ఒప్పుకోవడమే.

పునరుజ్జీవనం అంటే గతంతో పూర్తిగా తెగదెంపులు చేసుకోవడం యిది మొట్టమొదటిది. తర్వాతిది కొత్త చైతన్యం, కొత్త నైతిక నియమావళి పునరుజ్జీవనంలో యిమిడి వున్నాయి. జీవితానికి, ఆలోచనకూ, ఆచరణకూ, కీలకమైన స్థానంలో భగవంతుడు పోయి మనిషి ప్రవేశించడం కూడా పున రుజ్జీవనంలో యిమిడివుంది. ఇక్కడొక చిల్లర సంస్కరణగా, అక్కడొక ఋల్లి మార్పు చేయడం కాక, సమాజాన్నంతటినీ తలకిందులు చేయడం కూడా అందులో యిమిడి వుంది. ఒక విధంగా సాధించన దానికంటే, సాధించ దలచుకున్న దానికి యెక్కువ విలువ వుంటుంది. యూరప్‌ను గురించి చెబుతూ, విల్ డూరాంట్ యిలా అంటాడు: "పునరుజ్జీవన మానవుడు సాధిం చింది యేమైనా, అత నెప్పుడూ చలనశీలిగా, అసంతృప్తుడుగా, అవరోధాల పట్ల చిరచిర లాడుతూ దివ్యమానవుడుగా వుండాలని తహతహ పడుతూ వున్నాడు—ఆలోచనలో సాహసమూ, క్రియలో అసందిగ్ధతా, పలుకులో పటుత్వమూ, కళల్లో నైపుణ్యమూ, సాహిత్యంలో, తత్వశాస్త్రంలో అభిని

వేశమూ వుండి, యీ మానవుడు అటు అంతఃపుర కాంతలతోనైనా, యిటు సమరాంగణంలోని సైనికులతోనైనా కలసి మెలసి పోగలిగేవాడు.'' మన పునరుజ్జీవనం మందకొడిగా మొదలైనా యిలాంటి వాళ్ళు యెంత మంది జన్మించారు? యెక్కడో ఒకచోట ఒకరు, యెక్కడో మరోచోట మరొకరు- అంతే. అలా పుట్టిన ప్రతి మనిషికీ ప్రతి కక్షిగా ప్రతి చోటా లక్షమంది పునరుద్ధరణ వాదులూ, అంధకార ప్రియులూ వుద్భవిస్తున్నారు.

గురజాడ జీవితమూ, రచనలూ విచక్షణాయుతంగా పరిశీలిస్తే, ఒకటి విశదమవుతుంది: ఆయన వ్యంగ్యాస్త్రాలు కుహనా పునరుజ్జీవన వ్యక్తులమీద దాడిచేస్తే అచ్చమైన పునరుజ్జీవనంవైపు మనం అచంచలంగా, సత్వరంగా పురోగమించాలని ఆయన గాఢంగా వాంఛించారు. సుబ్రహ్మణ్యానికి ఆయన యిలా రాశారు: "నిజమే పాజిటివిస్టు తత్వవేత్త కామ్టే మానవతా వాదాన్ని ఒక మతంగా విస్తృత పరిచాడు. నేను దాన్ని సరిగ్గా ఆయన చూసినట్లే చూడను. మతాలు గందరగోళమైనవి. ఆచరణ యోగ్యంకానివి. మానవప్రేమ సరళమైన నియమం. అది మనిషికి అమితానందం కల్గిస్తుంది. 'ప్రేమ నిచ్చిన ప్రేమ వచ్చును—' స్వర్గంలో, యీ లోకంలో.'' ఇది భగవంతుని నిరాకరించడం కాదు. నిజమే కానీ యిది నిశ్చయంగా మతాలను నిరాకరించడం, మానవాకారానికి చెందిన భగవంతున్ని సయితం నిరాకరించడం.

యింకా ముందుకు కూడా వెళ్ళి, గురజాడ భారతీయ తత్వశాస్త్రంలో ప్రముఖశాఖ అయిన అద్వైతవేదాంతాన్ని నిశ్చయంగా తిరస్కరించారు. బాదారాయణుడు మొదలుకొని శంకరాచార్యుడు మొదలుకొని సర్వేపల్లి రాధాకృష్ణ వరకు, రెండువేల యేళ్లకుపైగా, అది మానవుడు రూపొందించిన అత్యంత వున్నతమూ, సత్యమూ, స్వచ్ఛమూ అయిన తత్వశాస్త్రమని దాని అనుచరులు వాదిస్తున్నారు. గురజాడ యీ వాదాన్ని నిరాకరిస్తూ, తన నోటు పుస్తకాల్లో, సుదీర్ఘంగా రాసుకున్నారు. అందులో నుంచీ కొన్ని భాగాలు యివి:

"అద్వైతం యెండమావి మాత్రమే: [గురజాడ రచనలో యీ వాక్యం తెలుగులోనే వుంది. తక్కిందంతా ఆంగ్లం]. యీ లోకం లోని మనుషులకు లోకమహాప్రవాహం యెవరి జీవిత గమనంవల్ల

వుప్పొంగుతుందో ఆ మనుషులకు-అది అందరానిది. యీ ప్రవాహం మహా కల్లోలంగా వున్నందువల్ల దీని వుపరితలంమీద పారమార్థిక సత్యం ప్రతిబింబింప జాలదు. మనం సాధ్యమైనంత స్వచ్ఛంగా వుండి ప్రతిబింబిస్తే పారమార్థిక సత్యం యొక్క ఛాయా మాత్రం గుర్తు యెక్కడో ఒక నక్షత్రం, రంగులీనే ఒకమేఘం లభింపవచ్చు. అంతకుమించి మనం ఆశించలేం. ప్రపంచం యొక్క అచ్ఛమైన తత్వం స్వార్థత్యాగంలో పరోపకారంలోవుంది. స్వార్థత్యాగానికి దారి తీయగల ప్రేరణ ప్రేమను మించింది వుందా? మానవాత్మ పూసిన అత్యంత వుజ్వలమైన పుష్పం ప్రేమ. వెర్రిప్రేమ కాదు, వ్యామోహం కాదు, అందమైన ఆత్మల సౌందర్యాన్నీ, స్ఫటిక స్వచ్ఛతనూ మెచ్చుకోవడం; పరోపకారమూ, దయా, శాంతి, నిశ్చలత్వమూ, మనోమైన రూపురేఖలద్వారా తొణికిసలాడే సౌందర్యం. మంచితనమే దైవం; మంచి తనాన్ని ప్రేమించడం దైవ ప్రేమను వ్యక్తంచేసే సూటిదారి, ఆత్మ చెడును విసర్జించి సచ్ఛీలాన్ని అలవరచుకొని, అభివృద్ధి చేసుకొనేకొద్ది దైవత్వాన్ని సమీపిస్తుంది; దైవాంశం అవుతుంది. ఆంగ్ల కవి యిలా అన్నాడు. "అతని ప్రార్థనే శ్రేష్ఠమైంది ..... ..... .....వగైరా"

ఆచరణ దీని గీటురాయి. ఆచరణీయమైన యీ తత్వశాస్త్రం లేకుంటే మనుషులు తమకు తెలీని అర్థ ప్రాముఖ్యాలున్న సిద్ధాంతాల్లో పడి కొట్టుకుపోతారు. వేదాంతం పేరుతో మన దేశంలో యెంత, వంచన యెంత మూర్ఖత్వం సాగుతుందో! అందువల్లే 'వేదాంతి వస్తున్నాడు, చెంబూ ముంతా జాగ్రత్తరోయ్' అనేది సామెతగా రూపొందింది"—

స్త్రీ పురుష సంబంధాలగురించీ, ఆ నీతులగురించీ గురజాడ కుండే భావాలు అచ్ఛమైన మతం గురించీ, అచ్ఛమైన తత్వశాస్త్రం గురించీ, ఆయనకున్న అవగాహనకన్నా కూడా తీవ్రమైనవి. స్త్రీ పురుషులను వేరు వేరు విధంగా విమర్శించే ద్వంద్వ ప్రమాణాలను ఆయన తప్పుపట్టాడు. సుబ్రహ్మణ్యానికి రాశిన ఒక వుత్తరంలో యిలా అన్నారు:

"నీ చుట్టూవున్న వైవాహిత జీవితాన్ని అధ్యయనం చెయ్యి. మీదవాళ్లైన భర్తల గురించీ, కురూపి భర్తల గురించీ, దుష్టభర్తల గురించీ, దుర్వ్యర

భర్తల గురించి భార్యలు యేమనుకుంటారో వూహించడానికి ప్రయత్నించు. దుష్టభార్యాలు, కురూపి భార్యలూ మొదలైన వాళ్ళ సంగతేమిటని నీవడగవచ్చు. కానీ, వాళ్ళుబానిసలు. మననుంచి వాళ్లు ఆశించే పవిత్రతకన్నా యెక్కువ పవిత్రతను మనం వాళ్ళనుంచీ ఆశిస్తున్నాం. భేదానికి మూలం అదే. పవిత్రులు కాని పురుషులందర్నీ నీవు తీవ్రంగా అసహ్యించు కుంటావనుకో. నీ మిత్రుల్లో నీ కెంత మంది మిగులుతారో చెప్పు—"

స్త్రీ పురుష సంబంధాల్లో తమ నియమ రాహిత్యాన్ని ప్రోత్సహిస్తున్నట్లు అపార్థం కలగకుండా గురజాడ యింకా యిలా రాశారు :

"పవిత్రత అనే భావాన్ని నేను మెచ్చుకుంటాను. కానీ ఖచ్చితంగా యీ భావ స్వభావం మేమిటి? యిది యెక్కడ పుట్టింది? యెలా అమల్లో వుంది? పవిత్రత అనేదాని మూలమేమిటి? స్త్రీ పురుష సంబంధాల గురించి యిప్పుడున్న సామాజిక నియమాలు మనం అందుకోనంత యెత్తు నుంచాయి. నియమోల్లంఘనలు అధికసంఖ్యలో వున్నాయి. మనం మనకే సత్యాన్ని తెలియజెప్పుకోవలసిన సమయం ఆసన్నమయింది. అపవిత్రులైన వివాహిత స్త్రీ పురుషులను పడుపు కత్తెల్లాగే అసహ్యించు కోవాలని నీవంటావు. నీవు క్షుణ్ణంగా ఆలోచించి, భేదం గుర్తించడానికి ప్రయత్నించ లేవా? విమర్శ శీలమైన నీబుద్ధి తప్పకుండా భేదాలను వెంటనే గుర్తించగలదు. ఒక విషయం పడుపుకత్తె నిష్కపటి. తనవృత్తి ధర్మంలో నిష్కపటి.. ఆ ఒక్క అంశాన్ని నేను విడదీసి చూస్తున్నాను."

భారతదేశంలో పుట్టిన కొద్దిమంది అచ్చమైన పునరుజ్జీవన వ్యక్తుల్లో ఒకరుగా గురజాడను గణించవచ్చునని పైమాటలు స్పష్టం చేస్తాయి. యీ రకం వ్యక్తి యితరులకన్నా భిన్నంగా వున్నతంగా వుంటాడు. "యిలాంటి వ్యక్తికున్న గుణాలు (14, 15, 16 శతాబ్దులనాటి యూరప్‌లో) రెండు కేంద్ర బిందువులను ఆశ్రయించుకొని వున్నాయి. బౌద్ధిక సాహసమూ, నైతిక సాహసమూ" అని విల్ డూరాంట్ అంటూ యిలా వివరిస్తాడు. "నిశితమూ, జాగరూకమూ, సర్వతోముఖ ప్రజ్ఞాన్వితమూ అయిన మనస్సు ప్రతి భావానికీ, ప్రతి భావానికి చలించేది, సౌందర్యానికి స్పందించేదీ, కీర్తి

కాంక్ష వుండేదీ అయిన మనస్సు ఆతత్వ పర్యవసానాలను లెఖ్ఖచేయని వ్యక్తి వాదమున్న మనస్సు; తన నిద్రాణ శక్తులన్నిటినీ అభివృద్ధి చేసుకోడానికి పూనుకొన్న మనస్సు, సగర్వమైన తత్వం, క్రైస్తవ నమ్రతను అసహ్యించుకొనేది, బలహీనతనూ, పిరికి తనాన్నీ యేవగించుకునేది; ఆనవాయితీలనూ, నీతులను, నిషేధాలనూ, పీఠాధిపతులనూ, ఒకోసారి భగవంతున్ని సయితం నిరాకరించేది. "క్రైస్తవ నమ్రత" అనే మాటలకు బదులు "హిందూ వేదాంతం" అంటే యిక యేమార్పు లేకుండా యీ భాగం గురజాడకు సంపూర్ణంగా, సముచితంగా వర్తిస్తుంది. ఆయన భారతదేశానికి పరిమితమై ఆలోచించ లేదు. ఆంధ్రదేశానికి అసలే పరిమితం కాలేదు; మొత్తం ప్రపంచాన్ని గురించి ఆలోచించారు. ఆయనకోరిన "పాతకొత్తల మేలు కలయిక" దీనిలోనుంచీ కొంతా, దానిలో నుంచీ కొంతా తీసుకొని రూపొందించిన కొత్త మిశ్రమంకాదు; అది సజీవ నూత్నసృష్టి. క్రమ పద్ధతివున్న సమగ్ర తత్వశాస్త్రాన్ని ఆయన రూపొందించలేదు. కానీ, భగవంతునికి బదులు మానవుడు కీలకాంశంగా వుండేదీ, పరలోకం పట్ల గాక, యిహలోకం పట్ల ఆసక్తి వుండేది అయిన ఒక తత్వశాస్త్రాన్ని స్పష్టంగా మనసులో వూహించుకున్నారు. నూతన మానవుని గురించీ, నూతన నీతిశాస్త్రాన్ని గురించీ ఆయన కలలుగన్నారు. ఒక్కమాటలో చెప్పాలంటే, ఆయన మార్పుకోరారు, నఖశిఖ పర్యంతమైన మార్పు, అందులోనూ సమూలమైన మార్పు.

గురజాడకు వయసులో పెద్దవాడైన సమకాలికుడు వీరేశలింగం. ఆయన కూడా మార్పుకోరారు, గురజాడ కోరినంత గాఢంగా కోరారు. కానీ, కొన్ని విషయాల్లో ఆయన జీవితమూ, ఆలోచనా గురజాడ కన్నా మౌలికంగా భిన్నమైనవి. ఆ యిద్దరిలో చిన్నవారు యెక్కువ విద్యావంతులు; యెక్కువ ప్రౌఢులు. వీరేశలింగం కన్నా ఆయన గ్రంథ పరిచయం విస్తారమైంది. అయన గ్రహణశక్తి నిశితమైంది. ఆయన సృజనాత్మక శక్తులు నిస్సందేహంగా గొప్పవి. వీరేశలింగంలాగా ఆయన కరకు నీతివాది కాదు. అందువల్ల ఆయన మానవ బలహీనతలను చాలావరకు మన్నించారు. యిది దౌర్బల్యమనుకుంటే, యీ దౌర్బల్యమే ఆయన సానుభూతిని విస్తృతపరచి ఆయనకు వుత్తమ రచయితగా తీర్చింది. వీరేశలింగానికి ఆగ్రహావేశాలు కల్గించే సన్నివేశాల్లో గురజాడ నవ్వి, హాస్య

మాడారు. వాళ్ళ చిత్తవృత్తుల్లోని భేదంవల్ల, అంతకన్నా ముఖ్యంగా మానవుని పట్లా, భగవంతుని పట్లా వాళ్ళ వైఖరుల్లో వున్న భేదంవల్ల, అపథ నిర్దేశకు లిద్దరి మధ్య సయోధ్య లేకపోయింది. ఇద్దరూ ఆధునికతా ప్రియులే. కానీ వీరేశలింగం వుదారవాది, గురజాడ తీవ్రవాది. వాళ్ళ రాజకీయాభిమానాల్లో కూడా యిదే కన్పిస్తుంది. ఆంగ్ల విద్య విమోచనాత్మక ప్రభావం మీద, బ్రిటీష్ పరిపాలనా వుపకారాత్మక స్వభావం మీద యిద్దరికీ సమానంగా విశ్వాసమున్నా, వీరేశలింగం భారతజాతీయ కాంగ్రెస్‌లోని మితవాద పక్షాన్ని సమర్థిస్తే, గురజాడ అతివాద పక్షాన్ని అభిమానించారు. దీన్నిబట్టి వీరేశలింగం గారిది జడబుద్ధి అనుకుంటే, ఆయనకు స్పష్టంగా అన్యాయం చేయడమవుతుంది. కాలంతోపాటు మారే ప్రశంసనీయమైన సామర్థ్యం ఆయన కుండేది. చనిపోయే కొన్నాళ్ళకుముందు ఆయన జంధ్యం తీసిపడేశారు, కొన్ని నెలలకుముందు సజీవ భాష అయిన వాడుక తెలుగు మీదగల నిషేధం పోవాలనీ అభిప్రాయానికి వచ్చారు. సజీవమైన భావాలను వ్యక్తం చేయడానికి ఆ భాషే సమర్థమైందనే నమ్మకం ఆయనకు కుదిరింది. వీరేశలింగం గురించీ తనకున్న గతాభిప్రాయాన్ని మార్చుకొని, ఆయన గొప్ప యోధుడనీ, మాన్యుడైన నాయకుడనీ, గురజాడ ఆయనకు జోహార్లు అర్పిస్తూ 1911 జనవరి 12 నాటి డైరీలో రాసుకున్నట్లు గురజాడ శిష్యుడు బుర్రా శేషగిరిరావు వుల్లేఖించారు. ఆ యేడాది డైరీని మరెవరూ చూడనూ లేదు. వుల్లేఖించనూ లేదు. అందువల్ల శేషగిరి రావు మీద నమ్మకంతోనే ఆ మాటను అంగీకరించాలి. నిశ్చయంగా నమోదయింది పండితుడుగా, రచయితగా, సమాజ నాయకుడుగా వీరేశలింగం మీద గురజాడ చేసిన విమర్శ. దీన్ని సంపూర్ణంగా అర్థం చేసుకోవచ్చు. మొత్తం మీద గురజాడ ఇరాస్మస్ లాంటివాడు కాగా, వీరేశలింగం లూథర్ లాంటివాడు.

గురజాడకు భిన్నంగా వీరేశలింగం కార్యవాది. అందువల్ల ఆయన ఒక్కొక్క అడుగు ముందుకు పోవలసివుండింది. యేది ఆచరణ యోగ్యమో, యేదికాదో ఆయన పరిగణించవలసి వుండింది. నాయకుడు అనుచరుల కన్నా మరీ యెక్కువగా ముందుకుపోతే అతను ఒంటరిగాడై దాదాపు యేమీ సాధించ లేడనే విషయం ఆయన గుర్తుంచుకోవలసి వచ్చింది. దీనికి భిన్నంగా గురజాడ ప్రధానంగా స్వాప్నికుడు. ఆయన కలలు దూరాతి దూరంలోని దిగంతాలను సయితం దాటి పోగలిగేవి. స్వాప్నికుడు రెక్కలు

కట్టుకుని వివరించగలడు. కార్యవాది బురదలో, రొంపిలో కాళ్లీడ్చుకుంటూ దారిపొడవునా పోరాటం చేస్తూ ఒక్కొక్క అడుగు ముందుకువేస్తూ సాగ వలసివుంటుంది.

గురజాడ సారభూతంగా స్వాప్నికుడు కాబట్టి, ఆయన సాహిత్య రచన పరిమాణంలో కొంచెమే అయినా, వీరేశలింగం రచనలకంటే కళా త్మక మైంది. చిరస్థాయి అయింది. దాని ప్రభావం పెరుగుతోంది; యింకా పెరుగుతోంది. మనకు గురజాడ నిర్దేశించిన గమ్యాలను చేరుకోవాలంటే మనమింకా అనేక యోజనాలు ప్రయాణించ వలసివుంది. ఆ గమ్యాలను మనం చేరుకున్న దాకా ఆయన మనకు దారిచూపిస్తూ, స్నేహపూరిత పరిహాసాలతో దీర్ఘ ప్రయాణంలో సేదతీరుస్తూ.

# సుసంచిత గ్రంథ సూచి


**గురజాడ తెలుగు రచనలు :**

1. కన్యాశుల్కం, మొదటి కూర్పు : టీకాటిప్పణితో బంగోరె పునర్ముద్రణ, మద్రాసు, 1969.
2. నీలగిరి పాటలు, మద్రాసు, 1907.
3. కన్యాశుల్కం, పరిష్కృతమైన కూర్పు, మద్రాసు, 1909.
4. కన్యాశుల్కం, సంగ్రహ కూర్పు: వి ఆర్. నార్ల, విజయవాడ, 1976.
5. ఆణి ముత్యాలు, విజయవాడ, 1959.
6. హండే అనంతపురం చరిత్ర, సంపాదకుడు: జి. వి. అప్పారావు, మద్రాసు, 1920.
7. ముత్యాల సరాలు, విజయవాడ, 1955.
8. కొండు భట్టీయం: బిల్హణీయం, విజయవాడ, 1954.
9. వ్యాస చంద్రిక, విజయవాడ, 1953.

**గురజాడ ఆంగ్ల రచనలు :**

1. డిసెంట్ పత్రం, మద్రాసు, 1914.
2 శ్రీరామ విజయ పీఠిక, బొంబాయి, 1901.
3. హరిశ్చంద్ర పీఠిక, ది మార్టిర్ ఆఫ్ ట్రూత్, మద్రాసు, 1887.

**అనువాదాలు :**

1. కన్యాశుల్కం (ఆంగ్లానువాదం) అనువాదకులు: యస్. యన్. జయంతి, హైదరాబాద్, 1964.
2. కన్యాశుల్కం (కన్నడానువాదం) అనువాదకులు: కె. క్రిష్ణయ్యంగార్, 1927.
3. కన్యాశుల్కం (రష్యన్ అనువాదం) అనువాదకులు: జడ్. యన్. పెత్రునిషేవా, 1962.
4. కన్యాశుల్కం (తమిళ అనువాదం) అనువాదకులు: ముదునూరు జగన్నాథ రాజు, 1964.

గురజాడపై ఆంగ్ల రచనలు :

1. మహాకవి గురజాడ అప్పారావు, రచయిత : జి. వి. సీతాపతి, హైదరాబాద్, 1978.
2. ది గురజాడ సూవెనీర్ : సంపాదకులు : దేవులపల్లి రామానుజరావు, హైదరాబాద్, 1962.
3. యూనిలిట్, హోమేజ్ టు గురజాడ, సంపాదకులు : అబ్బూరి రామకృష్ణారావు, సికింద్రాబాద్, 1963.
4. ఆన్ యిండియన్ జర్నలిస్ట్ (శంభుచంద్ర ముఖర్జీ) రచయిత : హెచ్. యల్. స్ట్రైకన్.

గురజాడపై తెలుగు రచనలు :

1. మహాకవి, మహాపురుషుడు గురజాడ అప్పారావు, రచయిత : సెట్టి ఈశ్వరరావు, బెజవాడ, 1945.
2. గురజాడ, రచయిత : శ్రీ శ్రీ., విజయవాడ, 1959.
3. గురజాడ వెలుగుజాడ, రచయిత : కె. వి. రమణారెడ్డి, విజయవాడ 1964.
4. మహోదయం, రచయిత : కె. వి. రమణారెడ్డి, విజయవాడ, 1969.
5. గురజాడ శతవార్షిక జయంతి సంచిక, సంపాదకులు : దేవులపల్లి రామానుజరావు, హైదరాబాద్, 1962.
6. పరిశోధన, శ్రీ గురజాడ అప్పారావు స్మారక సంచిక, సంపాదకులు : తిరుమల రామచంద్ర, మద్రాసు, 1956.
7. మహాకవి గురజాడ శతజయంతి ఉత్సవ సంచిక. ఖమ్మం, 1963.

తెలుగూ ఆంగ్లమూ కలిసినవి :

1. మహాకవి గురజాడ సెంటినరీ సూవనీర్, సంపాదకులు : కె. ఈశ్వరదత్ తదితరులు, ఢిల్లీ, 1963.
2. గురజాడ కమ్మెమొరేటివ్ వాల్యూమ్, సంపాదకులు : యం. చలపతిరావు, ఢిలీ, 1976.
3. గురజాడ శతజయంతి వార్షిక సంచిక, వాల్తేరు, 1963.

1471

1954 లో భారత ప్రభుత్వంవారిచే స్థాపించబడిన సాహిత్య అకాదెమీ పాలనాస్వేచ్ఛ గల జాతీయ సంస్థ. వివిధ భారతీయ భాషలకూ, రాష్ట్రాలకూ, విశ్వ విద్యాలయాలకూ చెందిన ప్రతినిధులు గల జనరల్ కౌన్సిల్ ఈ సంస్థ విధానాలను రూపొందిస్తుంది. అకాదెమీ మొదటి అధ్యక్షులు శ్రీ జవాహర్‌లాల్ నెహ్రూ.

భారతీయ భాషలలోని సాహిత్య కార్యక్రమాలను ప్రోత్సహించి సమన్వయ పరిచేందుకూ, ఒక భారతీయ భాషలోని ఉత్తమ సారస్వతమును అనువాద రూపంలో అన్య భారతీయ భాషల వారికి అందించేందుకూ అకాదెమీ కార్యక్రమం ఉద్దిష్టమైనది.

అకాదెమీ ప్రచురణలు ముఖ్యంగా భారతీయ భాషలకే పరిమితం. కాని భారతీయ రచయితలకూ, వారి రచనలకూ సంబంధించిన మౌలిక విషయాలను తెలియజేసేందుకు ఆంగ్లంలో కూడా గ్రంథ ప్రచురణ జరుగుతున్నది.

సాహిత్య అకాదెమీ
రవీంద్ర భవన్, న్యూఢిల్లీ-1
ప్రాంతీయ కార్యాలయములు :
మద్రాసు-18, కలకత్తా-29 &
బొంబాయి-14

# భారతీయ సాహిత్య నిర్మాతలు

ప్రాచీన, ఆధునిక భారతీయ సాహిత్య నిర్మాతలను గురించి తెలుసుకోవడం ద్వారా భారతీయ సాహిత్య చరిత్రలోని ప్రధాన ఘట్టాలను సామాన్య పాఠకుడు సైతం గ్రహించవచ్చు.

ఏ భారతీయ భాషలోనైనా దాని అభివృద్ధి వికాసములకు తోడ్పడిన సుప్రసిద్ధ రచయిత జీవిత కథనూ, ఆయన సాహిత్య సేవనూ ఈ శీర్షిక క్రింద ఆంగ్లంలో వెలువడే ప్రతి రచన నుంచీ గ్రహించవచ్చు.

* లక్ష్మీనాథ బెజ్‌బరువా-హేమ్ బరువా
* రాజా రామమోహన్‌రాయ్ - సౌ. ఠాకూర్
* కేశవసుత్ - ప్రభాకర్ మాచ్వే
ఇళంగో అడిగళ్ - ము. వరదరాజన్
* ప్రేమ్‌చంద్ - ప్రకాశ చంద్ర గుప్త
* ఈశ్వరచంద్ర విద్యాసాగర్ - హెచ్. బెనర్జీ
* కబీర్ - ప్రభాకర్ మాచ్వే
* తోరూదత్ - పద్మినీ సెన్ గుప్త
వేమన - వి. ఆర్. నార్ల
వీరేశలింగం - వి. ఆర్. నార్ల
* గాలిబ్ - యం. ముజీబ్
* మీరాబాయి - ఉషా నిల్సన్
* బసవేశ్వర - H. తిప్పేరుద్రస్వామి
*భారతేందుహరిశ్చంద్ర-మదన్‌గోపాల్
* మానిక్ బందోపాధ్యాయ - సరోజ్‌మోహన్ మిత్ర
* జీవనానంద దాస్ - చి. దాస్‌గుప్త
ప్రమథ చౌధురి-ఎ.కె.ముఖోపాధ్యాయ
చండీదాస్ - సుకుమార్ సెన్
* కుమారన్ ఆశాన్ - కె. ఎం. జార్జి
కాజి నజ్‌రుల్ ఇస్లాం - గో. హల్దార్
*సరోజినీ నాయుడు-పద్మినీ సెన్ గుప్త
*B.M.శ్రీకంఠయ్య-A. N.మూర్తిరావు
విద్యాపతి - రమానాథ్ ఝా
* వళ్ళత్తోళ్ - బి. హృదయకుమారి
జయదేవ - యస్. కె. చటర్జీ
* కంబన్ - యస్. మహరాజన్
నమ్మాళ్వార్ - ఎ. శ్రీనివాసరాఘవన్
డా॥ సి. ఆర్. రెడ్డి - డి. ఆంజనేయులు
*పోతన - డి. వేంకటావధాని
*వేదం వేంకటరాయశాస్త్రి - వి. వి. శాస్త్రి (జూనియర్)
* తారాశంకర్ బంద్యోపాధ్యాయ- మహాశ్వేత దేవి
* ఫకీర్ మోహన్ సేనాపతి - మాయాధర్ మాన్‌సింహ
* బాణభట్టు - కె. కృష్ణమూర్తి

* ఇవి తెలుగు చేయబడినవి.